Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 39 • 27-9-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# నరేంద్రమోడీ భయంతోనే జగన్‌కు బెయిలు?



పదహారు నెలల సుదీర్ఘ కాలం జైలు జీవితం గడిపిన వైఎస్‌జగన్ జన జీవితంలోకి వచ్చాడు. ఇంతకాలం జగన్ బెయిల్ దరఖాస్తులను తీవ్రంగా ప్రతిఘటిస్తూ వచ్చిన సిబిఐ ఈసారి మాత్రం బెయిల్ ఇస్తే మాకేమీ అభ్యంతరం లేదన్న ధోరణిలో వ్యవహరించింది. ఆయన్ను అభిమానించే వారికి, ఆయన పార్టీని నమ్ముకొని రాజకీయ ఆశల పల్లకీలలో వూరేగుతున్న వారికి ఇదెంతో వూరట కల్గించే పరిణామం. జగన్‌ను అన్యాయంగా జైలు పాలు చేశారని సోనియాగాంధీని శాపనార్థాలు పెడుతుండిన వర్గం ఇది. సిబిఐని నోటికొచ్చిన బూతులు తిడుతుండిన వర్గం కూడా. వారి దృష్టిలో జగన్ తప్పు చేయలేదని కాదు. అటువంటి తప్పు ఎవరు చేయడం లేదు అన్నది వాదన. అవినీతి పాపం చేయని వాడు రాజకీయాలలో ఎవడున్నాడన్నది దబాయింపు.

## జగన్ పట్ల జనంలో మోజు

జనంలో జగన్ పట్ల విపరీతమైన మోజు వుంది. అభిమానం వుంది. అది ఎవరూ కాదనలేని సత్యం. అట్లని జగన్ జనానికి చేసిన ఉపకారమేదీ లేదు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హఠాత్ మరణంతో పెల్లుబికిన సానుభూతి జగన్ మీద అభిమానంగా మారింది. సిబిఐ ఎన్ని కేసులు పెట్టినా, అరెస్టు చేసి జైలుకు పంపినా, నెలల తరబడి బయటి ప్రపంచంలో తిరిగే అవకాశం లేకుండా చేసినా, పత్రికలలో అవినీతి కథనాలు పుంఖాను పుంఖాలుగా ప్రచురితమైనా జనంలో మాత్రం మార్పు రాలేదు. ఆ అభిమానం అట్లనే కొనసాగుతూ వుంది.

## జైలు జీవితం ఘన కార్యమా?

సాధారణంగా తప్పు చేసి, జైలుకు వెళ్లిన వాడు సిగ్గుతో తలదించుకొంటాడు. ప్రజలకు ముఖం చూపించడానికి సిగ్గు పడతాడు. కరడుగట్టిన నేరస్తులు కూడా టీవీ కెమెరాల కంట పడకుండా ముసుగులు వేసుకొంటారు. లేదంటే ముఖానికి చెయ్యో, చేతిగుడ్డో అడ్డం పెట్టుకొంటారు. కానీ జగన్ మాత్రం తన జైలు జీవితం ఒక ఘనకార్యంగా చిత్రించు కోగలిగాడు. నేరం చేసిన నిందితుడిగా కాకుండా, నేరం తన నెత్తిన రుద్దించుకొన్న రాజకీయ బాధితుడిగా జనాన్ని నమ్మించగలిగాడు. అందువల్లనే 16 నెలలు చెరసాలలో వూచలు లెక్కపెట్టి బయటకు వచ్చిన ఆయన్ను, ఏ ఒలంపిక్ పతకమో సాధించి తిరిగి వచ్చిన హీరో వలె స్వాగతించారు జనం. చంచల్‌గూడా జైలు నుంచి లోటస్ పాండ్‌లోని తన రాజ ప్రసాదానికి మధ్య వున్న 20 కిలోమీటర్ల దూరం ప్రయాణాన్ని ఐదు గంటల వూరేగింపుగా జరిపించుకొన్నాడు. దాని పొడవునా జగన్ రాక కోసం గుంపులు గుంపులుగా నిలబడి ఎదురు చూశారు జనం.

## ప్లేట్ ఫిరాయించిన సిబిఐ

జగన్‌కు బెయిల్ రావడానికి సుప్రీం ఆదేశం కారణమని పైకి చెప్పే మాట. గతంలో ఆయన

కొరవ 16వ పేజీలో

# మోడీ, బాబు భాయి భాయి!





రాజకీయాలు చిత్రమైనవి. ఎప్పుడు ఏ ఇద్దరు ఒకటౌతారో, ఏ ఇద్దరు విడిపోతారో వూహించడం కూడా వీలు కాదు. కలవడానికైనా, కలహించుకోవడానికైనా ప్రాతిపదిక "అవసరం" మాత్రమే. చంద్రబాబు నాయుడుకు ఇప్పుడు బిజెపి అవసరం ఏర్పడింది. నరేంద్రమోడీకి చంద్రబాబుతో అవసరం పడింది. ఆ ఇద్దరూ ఒకటి కాబోతున్నారు. ఇది వూహాగానం కాదు. జరగబోయే పరిణామం.

చంద్రబాబు పాదయాత్ర చేస్తున్నప్పుడే ఈ ప్రస్తావన వచ్చింది. పెద్దిరెడ్డి వంటి తెలుగుదేశం నేతలు పాదయాత్ర సమయంలోనే బాబుకు హితబోధ చేశారు. కానీ అప్పుడు బాబు ఆ మాటలు విన్పించుకోలేదు. పొరపాటున కూడా బిజెపితో మైత్రే కోరుకోవద్దు. గతంలో ఒకసారి కలిసి, మైనార్టీ ఓట్లు దూరం చేసుకొన్నాము. మరొకసారి అటువంటి పొరపాటు చస్తే చేయను అని కుండ బద్ధలు కొట్టినట్లు చెప్పాడు. ఇది జరిగి నాలుగు నెలలు కూడా కాలేదు. అంతలోనే ఎంతో మార్పు. అద్వానీని పక్కకు నెట్టి నరేంద్రమోడీ బిజెపి అగ్రనేతగా అవతరించాడు. ఏ కారణమో తెలియదు కానీ ఆయన పట్ల దేశమంతా వ్యామోహం పెరిగిపోతున్నది. చదువుకొన్న యువతీ, యువకులు, మహిళలు నరేంద్రమోడీని ఆరాధిస్తున్నారు. దేశానికి అటువంటి నేత కావాలని కోరుకొంటున్నారు. మోడీ ప్రధాని అభ్యర్థి అన్ననాటి నుంచి బిజెపి పట్ల ప్రజలలో ప్రాబల్యం పెరిగిపోతున్నది.

కొరవ 14వ పేజీలో

# సినిమాకు చావుదెబ్బ

అత్తారింటికి దారేది అనే కొత్త తెలుగు సినిమా, విడుదలకు ముందే సిడిల ద్వారా జనంలోకి వెళ్లిపోవడం సినీ పరిశ్రమ అస్థిత్వం ఎంత ప్రమాదంలో పడిపోయిందో చెప్పకనే చెప్తున్నది. ఒక సినిమా తీయాలంటే, దాన్ని హాలులో కూర్చొని చూసినంత సులభం కాదు. ప్రతి సినిమా వెనుక ఎంతో మంది ప్రతిభావంతుల కళాతృష్ణ దాగి వుంటుంది. సృజనాత్మకత కలిసి వుంటుంది. క్రియేటివిటీ అనే పదానికి పర్యాయ పదం సినిమా. ఆశయం కోసం తీసినా, వ్యాపారం కోసం తీసినా సినిమా అనేది తీయాలంటే క్రియేటివిటీ కావాలి. అది ఏ ఒక్క అంశానికో పరిమితం కాదు. కథ, మాటలు, పాటలు, కెమెరా, ఎడిటింగ్, షూటింగ్ జరిపే స్టూడియో సెట్లు, వాటి అలంకరణ, నటీనటుల దుస్తులు, వారి తలకట్టుతో సహా కొన్ని వందల అంశాలలో పలురకాల కళాకారులు, రచయితలు, కవులు, సంగీత స్రష్టలు, నట ద్రష్టల ఉమ్మడి కృషి వుంటుంది. అందరి ప్రావీణ్యాన్ని కలబోతగా చేసి తీసిన సినిమాను కంప్యూటర్ల పరిజ్ఞానం కల్గిన చిరుద్యోగులు ఆకతాయితనంగా తస్కరించి, అందరికీ ఉచితంగా పంచి పెట్టడం ఒక రకంగా చెప్పాలంటే పైశాచిక ఆనందం.

జమీన్‌రైతు

ఎంత కష్టపడి సినిమా తీసినా దాన్ని జనం ఆదరిస్తారనే హామీ ఏమీ లేదు. ప్రేక్షకులకు ఏ సినిమా ఎప్పుడు ఎందుకు నచ్చుతుందో ఎందుకు నచ్చదో తలలు పండిన సినీ పండితులు కూడా చెప్పలేరు. అందువల్లనే సినిమా రంగం ఒక జూదంతో సమానంగా పరిగణింపబడుతున్నది. సినిమాల మీద మోజుతో ఆ రంగంలోకి అడుగుపెట్టి పాతాళంలో పాతర పడిపోయినవారు నూటికి తొంభై మంది అయితే, విజయం సాధించి నిలదొక్కుకొనే వారు పది శాతం మాత్రమే. అంతకంటే తక్కువ అన్నా అతిశయోక్తి కాదు. ఎందరో నిర్మాతలు సినిమాలతో బికారులుగా మారిన ఉదాహరణలు కోకొల్లలు.

ఉన్న సమస్యలు చాలవన్నట్లు ఈ పైరసీ భూతం సినిమా పరిశ్రమను తమ కోరలలో చిక్కించుకొని వికటాట్టహాసం చేస్తున్నది. దానివల్ల నిర్మాతలు ఎంతో నష్టపోతున్నారు. ప్రేక్షకుడు థియేటర్‌కు వెళ్లి టిక్కెట్ కొని సినిమా చూస్తేనే పెట్టిన పెట్టుబడి తిరిగి వచ్చేది అంతంత మాత్రం. ప్రేక్షకులకు ఆ శ్రమ లేకుండా సినిమా విడుదలకు ముందే సిడిల ద్వారా ప్రేక్షకుల ఇళ్లకు చేరిస్తే ఇక ఏ నిర్మాతా కొత్తగా సినిమా తీయలేడు. సినిమా రంగం భవిష్యత్తుకు అదొక గొడ్డలి పెట్టు.

కంప్యూటర్ రంగంలో శరవేగంగా జరిగిపోతున్న సాంకేతిక పరిజ్ఞాన అభివృద్ధి, దాన్ని అందిపుచ్చుకోవడంలో మన యువతరం చూపుతున్న అసాధారణ ప్రతిభ ఇందుకు కారణం. కంప్యూటర్ల ముందు పని చేసే ఉద్యోగులకు సినిమాను, దాని భాగాలను, పాటలను, దృశ్యాలను తస్కరించడం చిటికెలో పని. వారికదొక ఆనందం. దాని ద్వారా వారు సంపాదించేది చిల్లర పైసలు మాత్రమే. కానీ వారికి అదొక సరదా. ఆకతాయితనం. పైశాచిక వినోదం. కానీ దానివల్ల సినిమా పరిశ్రమపై అధారపడి బ్రతుకుతున్న వేలాది మంది జీవితాలు ప్రభావితమౌతున్నాయి. నిర్మాతలు, దర్శకులు కోలుకోలేని రీతిలో నష్టపోతున్నారు. నిర్మాత ఆర్థికంగా లాభపడినప్పుడే మరొక సినిమా తీయడానికి సిద్ధపడుతాడు. కానీ తీసిన సినిమా విడుదలకు ముందే జనం చూసేసి, థియేటర్లు ఖాళీగా మిగిలిపోతే ఎంత కొమ్ములు తిరిగిన నిర్మాత అయినా మళ్లీ సినిమా ఆలోచన చేయగలుగుతాడా చెప్పండి?

సాంకేతిక పరిజ్ఞానంతో కళాసృష్టిని తస్కరించే చోరులను అడ్డుకోవడానికి సాంకేతిక పరిజ్ఞానం మీదనే ఆధారపడక తప్పదు. కంటెంట్ సెక్యూరిటీ పేరిట అంతర్జాతీయంగా ఎంతో పరిశోధన జరుగుతున్నది. హాలీవుడ్ నిర్మాతలు దాని ద్వారానే తమ సినిమాల కాపీ రైట్‌ను రక్షించుకోగల్గుతున్నారు. తెలుగు నిర్మాతలు సైతం ఆ దారిలో నడవక తప్పదు. అది ఖర్చుతో కూడిన ప్రయత్నమే అయినా తప్పదు. దాని భారం ప్రేక్షకుల మీద మోపడానికి, టిక్కెట్ ధరను పెంచుకోవడానికి ప్రభుత్వం నిర్మాతలకు స్వేచ్ఛ ఇవ్వాలి.

మరొకప్రక్క కాపీ రైట్ నేరాలకు పాల్పడే వారిని కఠినంగా శిక్షించడంలో ప్రభుత్వం చొరవ చూపాలి. సినిమా కేసులంటే పోలీసులకు చాలా చులకన. అది పెద్ద నేరంగా పరిగణించరు. కానీ సినీ రంగ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, ప్రభుత్వం తన చట్టాలకు పదును పెట్టడంతోపాటు, పోలీసు యంత్రాంగానికి అవగాహన కల్పించే కృషి కూడా జరపాలి. అప్పుడే సినిమా రంగ భవిష్యత్తు బాగుంటుంది. సినిమా అనేది లేని జీవితాన్ని మనం వూహించగలమా? మన జీవితాల మీద వాటి ప్రభావం లెక్కించగలమా? అన్నం నీళ్ల తర్వాత అంత ప్రాధాన్యత వున్న అంశం అది. దాన్ని నిర్లక్ష్యం చేయడం తగదు.

## జనవాణి

### సరైన తీర్పు

న్యూఢిల్లీలో గత ఏడాది డిశంబర్ 16వ తేది 23 యేళ్ల యువతి నిర్భయపై ఆరుగురు కిరాతకులు ఒక ప్రైవేట్ బస్సులో సామూహిక అత్యాచారానికి ఒడిగట్టారు. దారుణ అత్యాచార అనంతరం నిర్భయను, ఆమె స్నేహితుడిని బస్సులో నుంచి విసిరిపారేసి వెళ్లిపోయారు. మెరుగైన చికిత్స కోసం నిర్భయను సింగపూర్‌కు తరలించినా ప్రయోజనం లేకుండా పోయింది. ఈ కేసులో ప్రథమ ముద్దాయి జైల్లో ఆత్మహత్య చేసుకొని చనిపోగా, మైనర్ బాలుడని ఇంకొకడిని జువైనల్ హోమ్‌కు పంపారు. మిగతా నలుగురు దోషులకు ఢిల్లీలోని సాకేత్ కోర్టు ఉరిశిక్ష విధించడం సహేతుకం. ఈ తీర్పు భవిష్యత్తులో ఇటువంటి దురాగతాలకు ఒడిగట్టకుండా మార్గదర్శకత్వమవుతుందని భావిస్తున్నాను.

*పి.అరుణాచలం* — *నెల్లూరు*

### వార్థక్య చాందసం!

దేశంలో సాధారణ ఎన్నికలు సమీపిస్తున్నాయి. ప్రధాన పార్టీలు గెలుపు కోసం అజెండాలు, జెండాలు ఎత్తుతున్నాయి. కాంగ్రెస్ పార్టీ పార్లమెంటులో ఆహార భద్రతా బిల్లును ఆమోదింపజేసుకొంది. దేశంలోని చాలా రాష్ట్రాలలో కాంగ్రెస్ పార్టీ బలహీన పడిపోయింది. అన్ని సర్వేలు నరేంద్రమోడీ బిజెపి సారధ్యం వహిస్తే ఫలితాలు బాగుంటాయని తేల్చి చెప్పాయి. కానీ బిజెపి అగ్రనేత ఎల్.కె.అద్వానీకి ప్రధాన మంత్రిత్వ పీఠంపై ఎన్నో ఏళ్లుగా కోరిక ఉంది. దాన్ని పార్టీ పట్టించుకోక మోడీనే తమ ప్రధాని అభ్యర్థి అని ప్రకటించడం ఆయన తట్టుకోలేక పార్టీ అధ్యక్షుడు రాజ్‌నాథ్‌సింగ్‌కు ఉత్తుత్తి ఆరోపణల ఉత్తరాలు వ్రాసి చివరికి ఉత్త భద్రయ్యగా మిగిలారు. పార్టీలో ఆయన మర్యాదగా వ్యవహరించే తీరు బట్టి భవిష్యత్తులో అద్వానీ రాష్ట్రపతి అయ్యే అవకాశం వుంది. దాన్ని ఆయన ఉపయోగించుకొంటే మంచిది.

*వాస్తు రామచంద్ర* — *నెల్లూరు*

### వ్యక్తులు ప్రత్యామ్నాయం కాదు!

లోక్‌సభకు ఎన్నికలు సమీపించాయి. జాతీయ కూటములకు నాయకత్వం వహిస్తున్న కాంగ్రెస్ పార్టీ తమ ప్రధాని అభ్యర్థి రాహుల్‌గాంధీ అని, బిజెపి నరేంద్ర మోడీని ప్రకటించాయి. ఈనాడు దేశం ఎన్నడూ లేనంతగా ఆర్థిక సంక్షోభంలో చిక్కుకుని పోయి వుంది. విదేశీ అప్పులు, తరిగి పోతున్న విదేశీ మారకద్రవ్య నిల్వలు, అడ్డూఆపులేని నిత్యావసర వస్తువుల ధరలు, వేల కోట్ల రూపాయల కుంభకోణాల్లో కూరుకుపోయి పార్టీలు ఏవిధంగా ప్రజల సమస్యలు పరిష్కరిస్తాయని చెప్పాల్సింది పోయి రాహుల్‌గాంధీ, నరేంద్రమోడీల భజనలు చేస్తున్నాయి. దేశాన్ని పరిపాలించను వ్యక్తులు ప్రత్యామ్నాయం కాదు. విధానాలు ప్రత్యామ్నాయం కావాలి.

*పి.బలరామ్* — *నెల్లూరు*

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**1-10-1943**
**పేజీలు:6 వెల: 0-1-6అణా**

### జమీందారుల ఘోరాలు – పొనగల్లు ఎస్టేట్ పాలన!

ఈ ధర్మ పరిపాలన క్రింద ప్రజలు మలమల మాడుచున్నారు. ఈ సంవత్సరం పైర్లు బొత్తిగా ఎండిపోయినవి. రాజాగారితో చెప్పుకొంటే ఔను వర్షములు లేవు. యెండిపోయిన సంగతి విచారిస్తామన్నారు. కాని పాపం స్వంతకాళ్లు కళ్లు లేని ఎస్టేట్‌కు నిజం ఎట్లా తెలుస్తుంది? రెమిషనుకు ఒకరు వంద మింగినారు. ఇతర చీదర చీడపురుగులు మరొక ఐదు వందలు తెమ్మంటున్నవి. కూటికి చచ్చే పేదలెట్లు తేగలరు?

గోరు చుట్టుపై రోకటి పోటన్నట్లు పట్టాలకిచ్చి పైర్లు పెట్టిన పొలాలను గూడ వదలి పెడతారా? లేదా? అని బాధిస్తున్నారు. జమీందారీలోని బాధలెన్నని చెప్పగలము? మా రాజాగారి చల్లని ప్రభుత్వం రైతుల నేడ్పించుటలో ప్రఖ్యాతిగన్నది.

–మేర్లపాక పౌరులు

### వెంకటగిరి హరిజన స్త్రీ

వెంకటగిరిలో హరిజన స్త్రీ పట్ల సబ్ యిన్స్‌పెక్టరుగా వుండిన బెంజిమన్ అనే వ్యక్తి అత్యాచారం జరిపాడని మోపబడిన కేసు సబ్‌జడ్జి కోర్టులో విచారణ జరిగి 27వతేది తోసివేశారు.

మిస్టర్ బెంజిమన్ గారు! ఇకనైనా లోకవృత్తం తెలుసుకొని ప్రవర్తించమని మా వినయ పూర్వక ప్రార్థన.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**27-9-1963**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నాల్గవ ప్రణాళికలో సోమశిల

పెన్నానదిపై సోమశిల ప్రాజెక్ట్ ఏనాడో రావలసిందని, నాల్గవ ప్రణాళికలో అది తప్పక చేర్చబడుతుందని కేంద్ర ఇరిగేషన్ విద్యుచ్ఛాఖా మాత్యులు డాక్టర్ కెఎల్.రావు గారు హైదరాబాద్‌లో చెప్పారు.

30తేదీ నెల్లూరుకు వస్తున్న డాక్టరు రావు గారికి సోమశిల తదితర నెల్లూరుజిల్లా ఇర్రిగేషన్ అవసరాలను నివేదించుటకు ప్రయత్నం జరుగుతున్నది.

### కావలి నీటి కరవు

నెల్లూరు జిల్లాలో మంచినీటికి కావలి పట్టణంలో వున్న కటకట మరొకచోట లేదు. ఉత్తరకార్తె నేటితో పోతున్నా వర్షం శూన్యమై ఎత్తరగంప పరిస్థితి జిల్లాలోని మెట్ట తాలూకాలన్నిటిలో వున్నా, త్రాగేనీటికి ఇక్కట్లు పాలుగావడం కావలి పౌరులొక్కరికే సంప్రాప్తమైనట్లుంది. కావలి టవున్‌లో దాదాపు బావులన్ని ఎండిపోయి, బోరింగులలో గూడా తగినంత ధారలేదు. ప్రభుత్వ ఆస్పత్రి పంపు వద్ద రాత్రంతా గూడా బిందెలను క్యూలలో పెట్టి స్త్రీలు, పురుషులు, పిల్లలు చారెడు నీళ్లకు నిద్రమానుకొని పడిగాపులు కాయవలసిన దుస్థితి; కొన్ని కుటుంబాలకు కుటుంబాలే పట్టణాన్ని వీడి పరాయిచోట్లకు పోవలసిన దుర్భర పరిస్థితి ఏర్పడిదంటే; తాము తెచ్చుకొన్న అన్నాన్ని తినుటకు లోటా మంచినీళ్లు దొరకని దైన్యస్థితి తాండవమాడుతున్నాదంటే, కావలి మంచినీటి సమస్య ఎంత విషమంగా తయారైనది ఊహించుకోవచ్చు.

*–జ.రై.సంపాదకీయం నుంచి*

# నెల్లూరు ముచ్చట్లు

## కలెక్టర్‌కు వెసలుబాటు!

జిల్లా కలెక్టర్ శ్రీకాంత్‌కు సమైక్యాంధ్ర ఉద్యమం మూలంగా కాస్త వెసలుబాటు దొరికింది. నిత్యం బిజీగా వుండే ఆయన ఉద్యోగుల సమ్మె మూలంగా ఇటు ఆఫీసులోనూ అటు బంగళాలోనూ ఒత్తిడి లేకుండా ఉంటున్నారు. ఆయన్ను కలవాలని వెళ్లిన వారితో తీరిగ్గా మాట్లాడుతున్నారు.

ఎస్పీ రామకృష్ణ మాత్రం ఉద్యమం మూలంగా ఉదయం 8.30 నుంచి రాత్రి 8.30 వరకు బంగళాలో బిజీగా వుంటున్నారు. కలెక్టర్ గారికన్నా ఎస్పీకే సందర్శకులు, అర్జీదారుల తాకిడి ఎక్కువగా వుంది.

## నక్కతోక తొక్కిన సి.కళ్యాణ్!

దక్షిణ భారత చలన చిత్ర మండలి, తమిళనాడు ప్రభుత్వం సంయుక్త యాజమాన్యన వందేళ్ల భారతీయ సినిమా వేడుకలను నెల్లూరీయుడు చిల్లర కళ్యాణ్ ఒంటి చేతిమీదుగా నిర్వహించి వార్తల్లో నిలిచారు. కళ్యాణ్ దక్షిణ భారత చలనచిత్ర మండలి అధ్యక్షుని హోదాలో అన్నీతానై ఈ కార్యక్రమాన్ని కొన్ని విమర్శలు రేగినా అద్భుతంగా నిర్వహించారు. కళ్యాణ్ స్వగ్రామం కొడవలూరు మండలంలోని తలమంచి. కళ్యాణ్ చందమామ, కొమరం పులి, పరమ వీర చక్ర, రక్త చరిత్ర, పంజా వగైరా సినిమాలు తీసిన నిర్మాతగా పరిశ్రమలో గుర్తింపు పొందాడు.

## విఆర్ లా కాలేజీలో అనధికార కౌన్సిలింగ్!

రాష్ట్రంలో నడుస్తున్న ఏకైక ఎయిడెడ్ కాలేజి నెల్లూరులోని విఆర్ లా కాలేజి. ఇక్కద బోధనా సిబ్బంది, తగినన్ని రూములు లేకపోయినా సీట్ల భర్తీకి అనధికార కౌన్సిలింగ్ జరిగి పోతుండడం చర్చనీయాంశమయ్యింది. సమైక్యాంధ్ర ఉద్యమంలో భాగంగా నెల్లూరులోని కాలేజీలన్నీ మూసి వున్నా విఆర్ లా కాలేజి మాత్రం తీసి సీట్లు భర్తీ చేస్తున్నారు. వాస్తవానికి అక్టోబర్ 8వ తేది నుంచి లా కాలేజిలో సీట్ల భర్తీకి కౌన్సిలింగ్ నిర్వహించాలి. మేనేజ్‌మెంట్ సీట్లను కన్వీనర్ కోటా ముగిశాక భర్తీ చేయాలి. కానీ ఆనం వివేకానందరెడ్డి నేతృత్వంలో నడిచే కాలేజి కాబట్టి తమిళనాడుకు చెందిన పలువురికి మేనేజ్‌మెంట్ కోటాలో 34వేల రూపాయలు ఫీజుగా తీసుకొని సీట్లు ఇచ్చేస్తున్నారు. లా కాలేజిలో మూడు సెక్షన్ల నిర్వహణకు క్లాసుకు 40 మంది విద్యార్థుల చొప్పున ఆరు రూములు కావాలి. కానీ ఈ కాలేజిలో రూముల కొరత, లెక్చరర్ల కొరత తీవ్రంగా వేధిస్తున్నా ఒక రిటైర్డ్ ప్రిన్సిపాల్‌ను పెట్టి క్లాసులకు హాజరు కాకపోయినా హాజరును వేస్తామని హామీ ఇస్తుండడంతో ఎక్కడెక్కడి వాళ్లు వచ్చి చేరుతున్నట్లు తెలిసింది. ఒకవైపు సమైక్యాంధ్ర ఉద్యమానికి నాయకత్వం వహించి నెల్లూరులోని కాలేజీలు, స్కూళ్లు మూయించి తన కాలేజిలో సీట్లు భర్తీ చేసుకోవడం ఒక్క వివేకానందరెడ్డికే చెల్లిందనాలి.

## మహిళా దొంగల ముఠా!

నెల్లూరు నగరంలో ఇప్పటివరకు దిగిన దొంగల ముఠాలు చాలవన్నట్లు ప్రత్యేకంగా మరో మహిళా దొంగల ముఠా కూడా దిగిందట. సమైక్యాంధ్ర ఉద్యమ నేపథ్యంలో ప్రదర్శనల దగ్గర వీరు తమ హస్తలాఘవం చూపిస్తున్నారట. టౌన్‌బస్సులు, ఆటోల్లో ప్రయాణించే మహిళలు వీరి టార్గెట్ అట. ఈ మహిళా దొంగల్లోని కొందరు సభ్యులే ట్రంకురోడ్డులోని నిర్మలా ఏజెన్సీలో 32 సెంటీమీటర్ల ఎల్‌సిడిని కాళ్ల మధ్యలో పెట్టుకొని చీర కుచ్చిళ్లు కప్పి షాపును దాటించిన చోర శిఖామణులు. నెల్లూరీయులు వీరి పట్ల జాగ్రత్తగా ఉండాలి సుమా!

## వేటగాడుగా వివేకా!

సమైక్యాంధ్రకు మద్దతుగా 24వ తేది జరిగిన నెల్లూరు బంద్‌ను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి వేటగాడు సినిమాలో ఎన్టీరామారావు ధరించిన టోపీ తరహాలోని టోపీ ధరించి పర్యవేక్షించారు. జీపులో అంగళ్లు మూయిస్తూ చేతులూపుతూ సమైక్యాంధ్ర నినాదాలు చేస్తూ గంటపాటు ట్రంకురోడ్డులో వివేకా హల్‌చల్ చేశారు.

## కార్పొరేషన్‌లో దొంగలు పడ్డారు!

నెల్లూరు కార్పొరేషన్ కార్యాలయంలో 20వ తేది దొంగలు పడ్డారు. విలువైన కంప్యూటర్ల తోపాటు కొంత సాంకేతిక సామాగ్రిని పట్టుకెళ్లారట. ఇది ఇంటి దొంగల పనా? బయట దొంగల పనా అనేది పోలీసుల దర్యాపులో తేలాల్సి వుంది.

## వీడియోగ్రాఫర్‌గా డిఆర్వో - రిపోర్టర్‌గా ఎజెసి!

జిల్లా ఉన్నతాధికారుల్లో ముఖ్యులైన అదనపు జాయింట్ కలెక్టర్ చల్లా పెంచలరెడ్డి రిపోర్టర్ అవతారం ఎత్తగా, డిఆర్వో రామిరెడ్డి వీడియోగ్రాఫర్‌గా మారారు. సమైక్యాంధ్రకు మద్దతుగా నెల్లూరు జర్నలిస్టుల సమైక్య వేదిక 20వ తేది గాంధీబొమ్మ వద్ద నిరసన ప్రదర్శన, వీధుల్లో విధి నిర్వహణ, వంటావార్పు కార్యక్రమాలు చేపట్టింది. ఈ సందర్భంగా మద్దతు తెల్పను వచ్చిన ఎజెసి, డిఆర్వో విలేకరులు దీక్షలో ఉండడంతో తాము కొంత సేపు రిపోర్టర్, వీడియాగ్రాఫర్లుగా మారారు. డిఆర్వో వీధిలో విలేకరులు నిర్వహించిన ప్రెస్‌మీట్‌లో పాల్గొన్నారు. వంటావార్పు కార్యక్రమంలోనూ గరిట తిప్పి నలభీములనిపించారు.

## వాహనాల నెంబర్ ప్లేట్లపై దృష్టి సారించిన ఎస్పీ!

నెల్లూరు నగరంలో తిరిగే వాహనాల నెంబర్ ప్లేట్లపై వివరాలు సక్రమంగా నమోదుచేసి ఉండకపోతే అటువంటి వాహనదారులపై కేసులు నమోదు చేస్తామని ఎస్పీ రామకృష్ణ హెచ్చరించారు. వాహనాలపై నెంబర్లు సక్రమంగా నమోదు చేయాలని స్టిక్కరింగ్ మేకర్స్‌తో తన బంగ్లాలో నిర్వహించిన సమావేశంలో ఆయన మాట్లాడుతూ నిబంధనల ప్రకారం నెంబరు ప్లేట్లు తయారు చేయండి. వాహనదారులు ఒత్తిడి చేసినా ఒప్పుకోవద్దు. ఇష్టమొచ్చిన నెంబరు ప్లేటు కనపడితే వాహనదారులతోపాటు తయారీదారులపై కేసులు పెడతామన్నారు. నగరంలో జరుగుతున్న నేరాల అదుపుకు నెంబర్ ప్లేట్ల సక్రమ నిర్వహణ కూడా ఉపకరిస్తుందని ఎస్పీ అభిప్రాయపడ్డారు. ఈ సమావేశంలో నగర డిఎస్పీ వెంకటనాథ్‌రెడ్డి, కావలి డిఎస్పీ ఇందిర కూడా పాల్గొన్నారు.


### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190


## ఆదివారం స్కూళ్లు!

సమైక్యాంధ్ర ఉద్యమం మూలంగా సాధారణ పనిదినాల్లో స్కూళ్లు మూత పడుతున్నాయి. ఉద్యమానికి మద్దతుగా 30వ తేది వరకు స్కూళ్లు తెరిచే అవకాశం లేకపోవడంతో స్కూళ్ల యాజమాన్యాలు 22వతేది ఆదివారం తరగతులు నిర్వహించాయి. రెండు మూడు నెలల పాటు ఆదివారాలు, సెలవు దినాల్లో స్కూళ్లు పనిచేయనున్నాయి.

## నిరవధిక దీక్షలో ఉపాధ్యాయులు!

ఒకప్పుడు ఉపాధ్యాయులు సమాజ మార్గదర్శకులు. ఈ మధ్య వారు విమర్శల పాలవుతున్నారు. ప్రస్తుతం జరుగుతున్న సమైక్యాంధ్ర ఉద్యమంలో గత 50 రోజులుగా నెల్లూరు గాంధీబొమ్మ వద్ద ప్రత్యేక శిబిరం ఏర్పాటు చేసుకున్న ఉపాధ్యాయులు నిరంతరం దీక్షా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రతి నిత్యం 50 మందికి తగ్గకుండా ఉపాధ్యాయులు దీక్షలో పాల్గొంటున్నారు. దీక్షా శిబిరం వెలుపల, లోపల సమైక్యాంధ్ర ఉద్యమంలో అశువులు బాసిన ఉపాధ్యాయుడు శంకరయ్య యాదవ్ చిత్రపటం అందర్నీ ఆకర్షిస్తుంది.

## జగన్‌కు బెయిల్ - నెల్లూరులో సంబరాలు!

వైఎస్ జగన్మోహన్‌రెడ్డికి సిబిఐ కోర్టు బెయిల్ మంజూరు చేసిందన్న వార్తతో నెల్లూరు నగరంలో 23వ తేది సాయంత్రం ఆ పార్టీ అభిమానులు సందడి చేశారు. నెల్లూరు సిటీ, రూరల్ సమన్వయకర్తలు అనిల్‌కుమార్‌యాదవ్, శ్రీధర్‌రెడ్డి నేతృత్వంలో స్కూటర్ ర్యాలీలు నిర్వహించి వివిధ సెంటర్లలో బాణా సంచా కాల్చారు. పార్టీ ఆఫీసుల్లో స్వీట్లు పంచుకొన్నారు.

## కాంగ్రెస్‌లోనే ఉంటా!

సూర్యచంద్రులతోపాటు తన బొందిలో ఊపిరి ఉన్నంత వరకు తాను కాంగ్రెస్ పార్టీలోనే ఉంటానని కోవూరు మాజీ ఎమ్మెల్యే పోలంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి స్పష్టం చేశారు. ఇటీవల ఆయన తెలుగుదేశంలో చేరుతారని వచ్చిన ప్రచారాన్ని ఖండించారు. సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొంటూ అశువులు బాసిన టీచర్ శంకరయ్య యాదవ్ కుటుంబానికి గొల్లపాళెం వెళ్లి లక్ష రూపాయలు విరాళాన్ని పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి అందించారు.

కొరవ 14వ పేజీలో

● శ్రీ వెంకటేశ్వర కాలేజ్ ఆఫ్

## ఇంజనీరింగ్ విద్యార్థుల ప్రతిభ!


వై.వి.సుధీర్ శెట్టి


ఎమ్.అవినాష్

ఆర్.సాయి రవితేజ

కె.రమ్యతేజ

**యూనివర్శిటీ పరిధిలో అత్యుత్తమ ఫలితాలు**

అనంతపురంలోని జెఎన్‌టియూ విడుదల చేసిన ఇంజనీరింగ్ రెండో సెమిస్టర్ ఫలితాలలో నార్తురాజుపాళెంలోని శ్రీ వెంకటేశ్వర కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్ విద్యార్థులు విజయ దుందుభి మోగించారని కాలేజి ఛైర్మన్ పెనుబల్లి బాబు నాయుడు చెప్పారు. ఆయన విలేకరులతో మాట్లాడుతూ ఈ కాలేజిలో ట్రిపుల్ ఈ చదివిన వై.వి.సుధీర్ శెట్టి 82.93, కె.హరీష్ 82.67, పి.అమృతవర్షిణి 82.53 శాతం, ఈసిఈ విభాగంలో దుర్గా మౌనిక 81.60, వి.శ్వేత 80.67, బి.వి.నవ్య సాహితి 80.13 శాతం, సి.ఎస్.ఇ విభాగంలో రమ్యతేజకు 77.87, సి.హెచ్.లక్ష్మీ జానకి 79.33, జె.అనిత 78.73 శాతం, సివిల్ విభాగంలో ఆర్.సాయి రవితేజ 77.20, ఎస్.యశస్వినాథ్ 74.80, ఆర్.రవితేజ 79.93 శాతం మార్కులు సాధించారు. మెకానికల్ విభాగంలో ఎం.అవినాష్ 80.40, ఎం.ఎస్.వి.యశ్వంత్ 80 శాతం, షేక్‌షాహుల్ 76.80 శాతం మార్కులు సాధించి జిల్లాలో శ్రీ వెంకటేశ్వర కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్‌ను ప్రథమ స్థానంలో నిలిపారు. 80 శాతానికి పైగా మార్కులు సాధించిన 11 మందికి పదివేల రూపాయలు, 75 మార్కులు సాధించిన 33 మందికి ఐదువేల రూపాయల చొప్పున ప్రోత్సాహకాలను అందిస్తున్నట్లు పెనుబల్లి బాబునాయుడు చెప్పారు. పూర్తిగా ఎన్‌ఆర్‌ఐల ఆధ్వర్యంలో సమర్థవంతంగా నిర్వహించబడుతున్న శ్రీ వెంకటేశ్వర కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్‌లో అత్యాధునిక వసతి సౌకర్యాలు, నైపుణ్యం కలిగిన అధ్యాపకులు, మంచి వాతావరణంలో కూడిన విద్య, అత్యుత్తమ ఫలితాలు సాధించడంలో దోహదపడ్డాయని కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ దత్తాత్రేయ శర్మ తెలిపారు. కళాశాల డైరక్టర్ రాయసం రాంబాబు, కళాశాల టీచింగ్, నాన్ టీచింగ్ ఈ సమావేశంలో పాల్గొన్నారు.

## అనాథ ప్రేతానికి గురుస్థానం!

**మెడికల్ కాలేజికి దేహదానం చేసిన పినాకిని దేహ సమర్పకుల సంస్థ**

నెల్లూరుకు చెందిన రాజ్యలక్ష్మి 70 ఏళ్ల వృద్ధురాలు. నా అనే వాళ్లు లేని నిరక్షరాస్యురాలు. ఆమెకు గురుస్థానంలో నిలిచే భాగ్యం కలిగింది. ఆమె మరణించడం, ఆమె దేహం వైద్యకళాశాలకు అందడంతో రాజ్యలక్ష్మికి ఈ భాగ్యం పట్టింది. ఈ మహిళ కొన్నాళ్లుగా నెల్లూరులోని విశాలాక్షి వృద్ధుల ఆశ్రమంలో నివసిస్తూ అనారోగ్యానికి గురైంది. ఆమెను ఆశ్రమం నిర్వాహకుడు కోసూరు రత్నం దొడ్ల సుబ్బారెడ్డి ప్రభుత్వ వైద్యశాలలో చేర్చారు. అయితే ఆమె ఈ నెల 18వ తేది మరణించడంతో దేహాన్ని వారు వైద్య సేవా రంగానికి అందజేశారు. ఈ విషయంలో పినాకిని దేహ సమర్పకుల సంస్థ వారికి తోడ్పడి మృతురాలి దేహాన్ని నారాయణ వైద్య కళాశాలకు అందజేశారు. దేహాన్ని నారాయణ వైద్య కళాశాల మానవ శరీర నిర్మాణ శాస్త్ర విభాగం సహాయాచార్యులు కె.దేవీ శంకర్ అందుకొన్నారు. వీరందరి తోడ్పాటుతో అనాథ, నిరక్షరాస్య, వృద్ధురాలు రాజ్యలక్ష్మి త్వరలో వైద్య విద్యాభ్యాసకులకు వైద్య విజ్ఞాన శాస్త్రబోధన చేస్తూ గురు పీఠాన్ని అలంకరించే మహదావకాశాన్ని మహద్భాగ్యాన్ని పొందబోతున్నది. వైద్య విజ్ఞాన సేవారంగానికి పినాకిని దేహ సమర్పకుల సంస్థ అందజేసిన ఐదవ దేహం రాజ్యలక్ష్మిది.

# వీరా విద్యార్థి సంఘ నేతలు?

● **ముగ్గురిపై లెక్కలేనన్ని ఆరోపణలు**





జిల్లాలో విద్యార్థి సంఘాల పేరుతో ఒకరిపై ఒకరు దాడులు చేసుకోవడం ఇటీవల కాలంలో అధికమైంది. విద్యార్థి ఎన్నికలు బ్యాన్ చేసిన తర్వాత ఇలాంటివి తగ్గుముఖం పట్టి వున్నాయి. కానీ విద్యార్థి సంఘాల నేతల ముసుగులో అల్లర చిల్లరిగా తిరిగే యువకులు బెదిరింపులకు పాల్పడడం, గొడవలకు దిగుతూ భయభ్రాంతులకు గురి చేస్తుండడంతో ప్రజలు ఆందోళన చెందుతున్నారు. ఇటీవల విద్యార్థి జెఏసి రాష్ట్ర కో కన్వీనర్ ఎం.వి.ప్రసాద్‌పై ఎన్ఎస్ యూఐ జిల్లా అధ్యక్షుడు ముజీర్ బృందం చేసిన దాడే ఉదాహరణ. వీరి వ్యవహారం పరిశీలిస్తే ఎవరికి ఎవరూ తీసిపోరు. అందరూ అందరే. అందరూ విద్యార్థి సంఘాల ముసుగులో దందాలకు దిగినవారే. ప్రసాద్, ముజీర్, కృష్ణయాదవ్ అనే వారిపై ఎన్నో ఆరోపణలున్నాయి. గతంలో టౌన్ బస్సుల్లో పనిచేస్తున్న ప్రసాద్ ఆ తర్వాత విద్యార్థి నేత అవతారం ఎత్తాడు. ఎన్ఎస్ యూఐ నేతగా వుంటూ ఆనం వివేకానంద రెడ్డి పంచన చేరి తన దందా కొనసాగించాడు. ఎమ్మెల్యే పిఏ రాజుతో సన్నిహితంగా వుంటూ విద్యా సంస్థల నిర్వాహకులను బెదిరించి డబ్బులు దండుకొంటున్నాడనే ఆరోపణలు వున్నాయి. ఆ తర్వాత ఒక రేషన్ షాపు వ్యవహారంలో పిఏ రాజుకు, ప్రసాద్‌కు మధ్య వివాదం తలెత్తింది. ప్రసాద్ ఆశించిన రేషన్ షాపును అతనికి కాకుండా చేశాడని రాజుతో విభేదించి బయటకు వచ్చాడు. అప్పటి నుంచి ఇద్దరి నడుమ వివాదం జరుగుతోంది. ఇక ఎన్ఎస్‌యూఐ ప్రస్తుత జిల్లా అధ్యక్షుడిగా వున్న ముజీర్ మొదట్లో ప్రైవేట్ ఉద్యోగం చేసేవాడు. పెళ్లై, పిల్లలు కల్గిన ముజీర్ వున్నట్టుండి ఆనం చెంత చేరి ఆయన ఆశీస్సులతో విద్యార్థి నేతగా మారి గొడవలకు దిగడం, దాడులు చేస్తూ దుందుడుకు వ్యక్తిగా ముద్ర పడ్డాడు. ఇతనిపై పలు పోలీస్ స్టేషన్లలో కేసులు వున్నాయి. విద్యార్థి జెఏసి రాష్ట్ర కన్వీనర్‌గా వున్న కృష్ణయాదవ్ గతంలో టిఎన్ఎస్ఎఫ్ విద్యార్థి నేతగా వుంటూ దందాలు సాగించడంతోపాటు జేమ్స్‌గార్డెన్‌లో పవన్‌కళ్యాణ్ ఫ్యాన్స్ నాయకుడితో కలిసి ప్రభుత్వ స్థలం ఆక్రమించాడన్న ఆరోపణలు వున్నాయి. ఈ ముగ్గురు విద్యార్థి నేతలు సమైక్యాంధ్ర ఉద్యమానికి సారథ్యం వహించడం మన ప్రారబ్ధం.

## ఇసి నారాయణరెడ్డి విగ్రహావిష్కరణ


విగ్రహావిష్కరణలో వివేకా, శ్రీధర్‌కృష్ణారెడ్డి.

● **మంచి మనిషన్న వక్తలు**

నెల్లూరు వేదాయపాళెంలోని లిల్లీ లిటిల్ ఫ్లవర్ స్కూల్ అధినేత దివంగత ఇసి నారాయణరెడ్డి విగ్రహావిష్కరణ కార్యక్రమం స్కూల్ ప్రాంగణంలో 19వ తేది ఘనంగా నిర్వహించారు. నెల్లూరు రూరల్, సిటీ ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి నారాయణరెడ్డి విగ్రహాన్ని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా వివేకానందరెడ్డి మాట్లాడుతూ నారాయణరెడ్డి తనతోపాటు చుట్టుప్రక్కల ఉండే ప్రజలు కూడా బాగుండాలని కోరుకొనే వ్యక్తని, వేదాయపాళెంలో ఆయన ఒత్తిడి చేయబట్టే తాను సిమెంట్ రోడ్లు వేయించానని చెప్పుకొచ్చారు. ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ తనకు 20 ఏళ్లుగా నారాయణరెడ్డి తెలుసని, ఎంతోమంది పేద పిల్లలకు ఉచిత విద్య అందించారని కొనియాడారు. చాట్ల నరసింహారావు నారాయణరెడ్డిలోని అద్భుత గుణగణాలను సభలో వివరించారు. తండ్రి ఆశయాలను నెరవేర్చాలని ఉద్యోగం వదిలిపెట్టి స్కూల్ నిర్వహణ బాధ్యతలు స్వీకరించిన కృష్ణచైతన్యను అభినందించారు. మాజీ కార్పొరేటర్ వెంకట జ్యోతి, పుర ప్రముఖులు, వివిధ పాఠశాలల కరస్పాండెంట్లు, స్కూల్ పిల్లలు, వారి తల్లితండ్రులు పాల్గొన్నారు.

## మూడు అంతర్జాతీయ సదస్సులకు పెరుగు!



విశ్వవ్యాప్తంగా జరుగుతున్న ప్రతిష్ఠాత్మక సాహితీ సదస్సుల్లో పాల్గొనవలసిందిగా నెల్లూరు కవి పెరుగు రామకృష్ణకు ఆహ్వానాలు అందాయి. ఈ నెల 28వ తేది యూరప్‌లోని అల్బేనియా దేశంలో జరిగే సదస్సుకు హాజరై భారతీయ – అల్బేనియా సాహిత్య తులనాత్మక అధ్యయనంపై కవితాగానం చేయమని కోరారు. అక్టోబర్ 5వ తేది నుంచి 9వ తేది వరకు బ్యాంకాక్‌లో జరుగనున్న ఆసియా పసిఫిక్ రచయితల సంస్థ నిర్వహించే అనువాద రచనల సదస్సులో అక్టోబర్ చివరి వారంలో మలేషియా దేశంలోని పేర్క రాష్ట్రంలో జరుగనున్న 33వ వరల్డ్ కాంగ్రెస్ ఆఫ్ పోయెట్స్‌లో పాల్గొని కవితాగానం చేస్తారు. విశ్వవ్యాప్తంగా 40 భాషలకు సంబంధించి 200 మందికి పైగా విశ్వకవులు ఈ అంతర్జాతీయ కవితా సదస్సులలో పాల్గొంటారు.

## శ్రీనివాస కల్యాణ మహోత్సవం!


దేవేరులతో దేవదేవుడు.

నెల్లూరు టిటిడి కళ్యాణ మండపంలో శ్రవణ నక్షత్రాన్ని పురస్కరించుకొని తిరుమంజనము, శ్రీనివాస కళ్యాణ మహోత్సవం ఘనంగా నిర్వహించారు. గోవింద గిరిధర్ అన్నమయ్య కీర్తనలతో వేదపండిత మంత్రోత్సాహాల మధ్య భక్తులు అధిక సంఖ్యలో పాల్గొని తీర్థప్రసాదాలు స్వీకరించారు. హిందూ ధర్మ ప్రచార పరిషత్, ధర్మ ప్రచార మండలి సభ్యులు, వాకాటి విజయకుమార్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## అటకెక్కిన బ్లాక్ ఫిల్మ్ తొలగింపు

దేశ రాజధానిలో నిర్భయ సంఘటన జరిగిన తర్వాత వాహనాలకు బ్లాక్ ఫిల్మ్ తొలగింపు కార్యక్రమం చేపట్టారు పోలీసులు. నెల రోజుల తర్వాత ఏ కారణం చేతనో తెలియదుగానీ బ్లాక్ ఫిల్మ్ తొలగింపు కార్యక్రమానికి బ్రేక్ పడింది. బస్సులు, వ్యాన్‌లు, కార్ల అద్దాలకు బ్లాక్ ఫిల్మ్ వినియోగించడంతో లోపల అసాంఘిక కార్యకలాపాలు జరిగేవి. వాహనాల లోపల ఏం జరుగుతుందో బయటకు కనిపించేది కాదు. వ్యతిరేకంగా వుండే వారిని కిడ్నాప్ చేయడం, బాలికలను అపహరించి అత్యాచారం చేయడం వంటి సంఘటనలు చోటుచేసుకునేవి. వాహనాలకు బ్లాక్ ఫిల్మ్ వినియోగించడం సుప్రీంకోర్టు స్పందించి పోలీసు శాఖను మందలించేదాక ఎవరూ పట్టించుకున్న దాఖలాల్లేవు. కోర్టు ఆదేశాలతో జిల్లాలో బ్లాక్ ఫిల్మ్‌లు వున్న వాహనాలను ఎక్కడ పడితే అక్కడ నిలిపి వేసి తొలగించారు పోలీసులు. దాదాపు తొమ్మిది నెలల క్రితం చేపట్టిన కార్యక్రమం నెల రోజులపాటు కొనసాగించిన అనంతరం పట్టించుకోలేదు. ప్రస్తుతం అన్ని కార్లు, వ్యాన్‌లు, కళాశాల బస్సుల్లో బ్లాక్ ఫిల్మ్ వినియోగిస్తున్నారు. మళ్లీ ఏదో ఒక ఊహించని సంఘటన జరిగితేనే తప్ప పోలీసులు స్పందించే అవకాశం కనిపించడం లేదు.

# బాలింత ప్రాణాలు తీసిన వైద్యం!

## కావలి ఏరియా ఆస్పత్రిలో మరో ఘోరం




బాలింత ప్రాణాలు తీసిన కావలి ఏరియా హాస్పిటల్.

ప్రసవానికి వచ్చిన మహిళ ప్రాణాలు కోల్పోయిన ఘటన కావలి ఏరియా ఆస్పత్రిలో కలకలం రేపింది. వైద్యుల నిర్లక్ష్యం కారణంగానే ఈ ఘటన జరిగిందని, నిండు ప్రాణాలు కోల్పోయిందంటూ బాధితులు ధర్నాకు దిగడంతో ఆస్పత్రి వద్ద ఉద్రిక్త పరిస్థితి నెలకొనింది. కావలి తుఫాన్ నగర్‌కు చెందిన మాదాటి రమణమ్మ అనే గిరిజన మహిళ కాన్పు కోసం ప్రభుత్వ ఆస్పత్రిలో సెప్టెంబర్ 19న చేరింది. వైద్యులు లేకుండా అక్కడి నర్సులే కాన్పు చేశారు. కొంత సేపటికి రమణమ్మకు తీవ్ర రక్తస్రావం అవుతుండడంతో కుటుంబ సభ్యులు వైద్య సిబ్బందికి తెలిపారు. ఆస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ నాగమణి గైనకాలజిస్టు జయమ్మకు కుట్లు వేయమని చెప్పి పంపింది. కానీ అప్పటికే పరిస్థితి విషమించడంతో రక్తం ఎక్కించినా ఉపయోగం లేక పేషెంట్ కోమాలోకి వెళ్లింది. దీంతో మెరుగైన చికిత్స కోసం నెల్లూరుకు తరలిస్తుండగా మార్గమధ్యంలో గౌరవరం వద్ద ఆమె చనిపోయింది. మృతదేహాన్ని తిరిగి ఆస్పత్రికి తీసుకరాగా సంబంధిత వైద్యులు ఎవరూ పట్టించుకోకపోవడం, నిర్లక్ష్యంగా వ్యవహరించడంతో బంధువులు, గిరిజన, దళిత సంఘాలు మృతదేహంతో ఆస్పత్రి వద్ద ధర్నాకు దిగాయి. డాక్టర్లు నిర్లక్ష్యంగా వ్యవహరించడం వల్లే రమణమ్మ మృతి చెందిందని కుటుంబ సభ్యులు, వివిధ సంఘాలు ఆరోపించాయి. గిరిజన మహిళకు జరిగిన దారుణంపై విచారణ జరిపించాలని డిమాండ్ చేశారు. ఆస్పత్రి సూపరింటెండెంట్ నాగమణి మాత్రం తాపీగా ఇలాంటివి మామూలే ఇందులో మా తప్పేమీ లేదు. పత్రికల వాళ్లు ఇష్టం వచ్చినట్లు వ్రాసుకొన్నా మాకేమీ నష్టం లేదంటూ మాట్లాడడం పట్ల తీవ్ర నిరసనలు వ్యక్తం అవుతున్నాయి.

# వెలమ విద్యార్థులకు స్కాలర్ షిప్పుల పంపిణీ!

## ఆత్మీయంగా జరిగిన కార్యక్రమం

టెన్త్, ఇంటర్, డిగ్రీ, పిజికోర్సులలో 2012–13 సంవత్సరంలో మంచి మార్కులు సాధించి ప్రతిభ చూపిన విద్యార్థినీ, విద్యార్థులకు నెల్లూరు జిల్లా వెలమ సంఘం రెండు లక్షల రూపాయల స్కాలర్ షిప్పులు అందించింది. 22తేది రెవెన్యూ కాలనీలోని చాగణం భాస్కరరావు వెలమ సంఘం భవనంలో సంఘం మాజీ అధ్యక్షుడు పురిణి శ్రీనివాసులు మాట్లాడుతూ 1994 సంవత్సరంలో 25వేల రూపాయలతో ప్రారంభించిన స్కాలర్ షిప్పులు ఈరోజు రెండు లక్షల రూపాయలుగా ఎదగడం ఆనందంగా వుందన్నారు. ప్రతి వెలమ విద్యార్థి ఈ స్కాలర్ షిప్పులు వినియోగించుకొని ఉన్నతస్థితికి రావాలన్నారు. పేద వెలమ విద్యార్థులకు ఈ యేడాది నుంచి హాస్టల్ వసతి కల్పించనున్నామని ఇక్కడ భోజనం పెట్టే ఏర్పాటు కూడా చేస్తామన్నారు. పెనుబల్లి హనుమంతరావు మాట్లాడుతూ ప్రస్తుతం స్కాలర్ షిప్పులు తీసుకొంటున్న విద్యార్థినీ విద్యార్థులు బాగా చదువుకొని ఉద్యోగాలు సాధించి వెలమ సంఘానికి ఎంతో కొంత సాయపడాలన్నారు. జిల్లా వెలమ సంఘం అధ్యక్షుడు వేగూరు కృష్ణ రాజేంద్రరావు మాట్లాడుతూ వెలమ సంఘం భవన దాత చాగణం గౌరీ శంకర్ కూడా సంఘం స్కాలర్ షిప్పు తీసుకొని చదివారని ఆయన స్కాలర్ షిప్పులకు లక్ష రూపాయలు విరాళంగా ఇవ్వడం ఆనందంగా వుందన్నారు. సంఘం కార్యదర్శి పెళ్లూరు రామయ్య మాట్లాడుతూ జిల్లాలో వున్న ప్రతి వెలమ కుటుంబం సంఘంలో సభ్యత్వం తీసుకోవాలన్నారు. రిటైర్డ్ కామర్స్ లెక్చరర్ చింతపట్ల ఆంజనేయులు గవర్నమెంట్ పాలిటెక్నిక్‌లో చదువుకొంటున్న వడ్లమాని నందిని అనే విద్యార్థినికి 10వేల రూపాయల ఆర్థిక సహాయం చేశారు. ప్రతి ఏడాది ఒక విద్యార్థికి ఈ సాయం చేస్తానన్నారు. ఈ కార్యక్రమంలో సంఘం ఉపాధ్యక్షుడు పంచేటి లక్ష్మీనరసయ్య, కోశాధికారి జె.సుబ్బరాయుడు, మాజీ అధ్యక్షుడు డాక్టర్ జివిజి కృష్ణమూర్తి, జలదంకి నాగేశ్వరరావు, జలదంకి హజరత్తయ్య, గ్రిద్దలూరు బాబా వెంకటేశ్వర్లు, వెలమ సంఘం యువ నాయకుడు మోపూరు భాస్కర్, సురేష్‌నాయుడు, పాకాల వెంకటకృష్ణయ్య తదితరులు పాల్గొన్నారు.

# గూడూరు గర్జన!

## బ్రహ్మాండంగా జరిగింది

సమైక్యాంధ్ర ఉద్యమం చేపట్టి 50 రోజులు గడిచిపోయాయి. గ్రామం, పట్టణమన్న తేడా లేకుండా జిల్లావ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో సమైక్యాంధ్ర నినాదం మారుమ్రోగిపోతోంది. గూడూరు డివిజన్‌లోనూ సమైక్యవాదం రోజురోజుకు బలపడుతోంది. ప్రభుత్వ ఉద్యోగులు, స్వచ్ఛంద సంస్థలు, ప్రజా సంఘాలు , విద్యార్థులు, మహిళలు, కళా సంఘాలు వారు వీరు అన్న తేడా లేకుండా స్వచ్ఛందంగా సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొంటున్నారు. ఇటీవల వీళ్లందరూ కలసి స్థానిక అల్లూరు ఆదిశేషారెడ్డి క్రీడా ప్రాంగణంలో రాష్ట్ర విభజనను నిరసిస్తూ, సమైక్యగళాన్ని విన్పిస్తూ భారీ సభ నిర్వహించారు. గూడూరు గర్జన పేరుతో జరిగిన ఈ కార్యక్రమంలో చుట్టుప్రక్కల ప్రాంతాల నుంచి భారీ సంఖ్యలో జనం తరలిరావడంతో సభా ప్రాంగణం సమైక్యవాదులతో కిటకిటలాడగా, వారు చేసిన సమైక్య నినాదాలతో ఆ ప్రాంతం దద్దరిల్లిపోయింది. గూడూరు ఆర్‌డిఓతోపాటు డివిజన్‌లోని అన్ని మండలాల తహశీల్దార్లు, ఇతర రెవిన్యూ సిబ్బంది, రవాణాశాఖ అధికారులు, కుల సంఘాలు, వ్యాపార సంఘాల వారు హాజరయ్యారు.

# తలమంచి యువకుల ఆదర్శం!

## సమైక్యాంధ్రకు మద్దతుగా రక్తదానం



రక్తదానం చేస్తున్న తలమంచి యువకులు.

జిల్లాలో సమైక్యాంధ్రకు మద్దతుగా పలువురు ఆందోళనలు, నిరసన కార్యక్రమాలు చేపడుతుంటే తలమంచి గ్రామ యువకులు మాత్రం వీటికి భిన్నంగా రక్తదానం చేసి సమైక్యాంధ్రకు మద్దతు తెలిపారు. స్థానిక యువతులు సంఘటితమై విపిసి స్కూల్లో రక్తదాన శిబిరాన్ని ఏర్పాటు చేసి 50 మందికిపైగా యువకులు రక్తం ఇచ్చేలా ప్రోత్సహించడంతో కార్యక్రమం విజయవంతం అయ్యింది. ఈ సందర్భంగా యువకులు మాట్లాడుతూ రక్తదానం ప్రాణదానంతో సమానమని అందుకోసమే సమైక్య ఉద్యమంలో మిగతావారు చేస్తున్న కార్యక్రమాలకు భిన్నంగా ఈ రక్తదాన శిబిరం నిర్వహించామన్నారు. ఎందరో త్యాగమూర్తుల త్యాగఫలంతో ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రాన్ని కొందరు స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం విడగొట్టడం దారుణమన్నారు. రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచడం కోసం ప్రాణ త్యాగానికైనా సిద్ధమని ప్రకటించారు. ఈ కార్యక్రమంలో స్థానిక యువకులు కర్ణ సుధాకర్, నలబోతుల సతీష్, కొల్లు సునీల్, రాయపు వేణు, బ్రహ్మదేవి వెంకటేశ్వర్లు, వేగూరు రమేష్‌నాయుడు, ఆత్మకూరు సతీష్, విశ్వకవి బాలకృష్ణ, రెడ్‌క్రాస్ సిబ్బంది డాక్టర్ జులియానా, మోటివేటర్ మోపూరు భాస్కర్‌నాయుడు, అంబులెన్స్ వర్కర్స్ అసోసియేషన్ జాయింట్ సెక్రటరీ పెళ్లూరు సురేష్ తదితరులు పాల్గొన్నారు.

# జొన్నవాడ కామాక్షమ్మ సన్నిధిలో దసరా!

## ● అక్టోబర్ 14వ తేదీ వరకు



బుచ్చిరెడ్డిపాళెం మండలం జొన్నవాడలో వెలసియున్న శ్రీ మల్లిఖార్జునస్వామి సమేత కామాక్షితాయి దేవస్థానంలో అక్టోబర్ 5 నుంచి 14తేది వరకు శరన్నవరాత్రి ఉత్సవాలు జరుగనున్నాయి. ప్రతి ఏడాది నిర్వహిస్తున్న విధంగానే ఈ సంవత్సరం శరన్నవరాత్రులను వైభవంగా జరిపేందుకు అన్ని ఏర్పాట్లు చేసినట్లు ఆలయ కార్యనిర్వహణాధికారి కామినేని శివకుమార్ తెలిపారు. 5తేది రాత్రి కలశ స్థాపనతో ప్రారంభమయ్యే ఈ ఉత్సవాల్లో 6వ తేదిన త్రిపురాంబికా అలంకారం, 7తేదిన రక్తబీజ వధ అలంకారం, 8న మధుకైటభవధ అలంకారం, 9న రాజరాజేశ్వరి అలంకారం, 10వ తేదిన భండాసుర వధ అలంకారం, 11న సరస్వతి అలంకారం, 12న దుర్గాష్టమి సందర్భంగా దుర్గ అలంకారం, 13న మహార్నవమిని పురస్కరించుకొని మహిషాసుర మర్ధని అలంకారం, 14న విజయదశమి సందర్భంగా శమీపూజ, అశ్వవాహన సేవ, గ్రామోత్సవం జరుగుతాయన్నారు. ఈ నవరాత్రుల్లో ప్రతిరోజూ శ్రీ సూక్త పారాయణం, దేవీ సప్తశతి, దేవీభాగవత పారాయణం జరుగుతుందన్నారు. అలాగే ఉదయం 7 గంటలకు, ఆ తర్వాత తిరిగి 9 గంటలకు రెండు విడతలుగా నవావరణ పూజలు జరిపిస్తున్నట్లు తెలిపారు. భక్తులందరూ ఈ ఉత్సవాల్లో పాల్గొని అమ్మవారిని దర్శించుకొని కృపకు పాత్రులు కావాలని కోరారు.

# జ్వాలాముఖి ఆలయ అభివృద్ధికి చర్యలు!

## ఛైర్మన్ సోమన వాగ్దానం

తోటపల్లిగూడూరు మండలం వరిగొండ గ్రామంలోగల జ్వాలాముఖి ఆలయ నూతన ఛైర్మన్‌గా ఎంపికైన సోమన శ్రీనివాసులురెడ్డి అభినందన సభ ఇటీవల స్థానికంగా జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిధిగా విచ్చేసిన సర్వేపల్లి శాసన సభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి శ్రీనివాసులరెడ్డిని అభినందించారు. బాధ్యతలు సక్రమంగా నిర్వహించినప్పుడే ఛైర్మన్ పదవికి వన్నె తెచ్చినట్లవుతుందన్నారు. మాజీ ఎమ్మెల్యే సివి.శేషారెడ్డి ఆలయ పూర్వాపరాలను వివరించారు. అనంతరం ఛైర్మన్‌ను ఘనంగా సన్మానించారు. ఈ సందర్భంగా సోమన శ్రీనివాసులురెడ్డి మాట్లాడుతూ ఎమ్మెల్యే అండదండలు, భక్తుల సహకారంతో దేవాలయాన్ని అభివృద్ధి చేస్తానన్నారు. కళ్యాణ మండపం, ఊంజల్ సేవా మండపం, షాపింగ్ కాంప్లెక్స్, వాటర్ ట్యాంక్ తదితర సౌకర్యాలను కోటి రూపాయలతో నిర్మిస్తామన్నారు. నిత్యప్రసాదాలకు తగిన ఏర్పాట్లు చేయనున్నట్లు ప్రకటించారు. ఈ కార్యక్రమంలో మండల కాంగ్రెస్ అధ్యక్షుడు కోదూరు దిలీప్‌రెడ్డి, ముత్తుకూరు మండలనేత ఈదూరు రామ్మోహన్‌రెడ్డి, కోదూరు పెదబాబిరెడ్డి, చినబాబిరెడ్డి, దేవళ్ల దశరథరామిరెడ్డి, శ్యామలమ్మ తదితరులు పాల్గొన్నారు.

# విభజన పాపం కాంగ్రెస్‌దే!



### బోగోలులో జక్కా వెంకయ్య విమర్శ

రాష్ట్ర విభజన పాపం కాంగ్రెస్ పార్టీదేనని సిపిఎం సీనియర్ నేత జక్కా వెంకయ్య ఆరోపించారు. స్వార్ధ రాజకీయాల కోసం రాష్ట్రాన్ని రెండుగా చీల్చేందుకు కుట్ర పన్నిందన్నారు. బోగోలు పంచాయితీ కార్యాలయ ఆవరణలో సమైక్యాంధ్రపై జరిగిన సభలో ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగించారు. ఆంధ్ర రాష్ట్రంలో తమ ఆటలు సాగవని తెలుసు కొన్న కాంగ్రెస్ పార్టీ అధినాయకత్వం అధికారాన్ని నిలబెట్టు కోవడం కోసం తెలంగాణ ఇవ్వడానికి సిద్ధపడిందన్నారు. వచ్చే ఎన్నికల్లో తెలంగాణ ప్రాంతీయుల మద్దతుతో అధికారంలోకి రావాలని చేస్తున్న కుటిల ప్రయత్నమని విమర్శించారు. ప్రత్యేక తెలంగాణ పోరాటం బలపడి రాష్ట్ర విభజనకు దారితీస్తే ఆ పాపం కాంగ్రెస్ పార్టీదేనన్నారు. ఆనాడు ఆంధ్ర రాష్ట్ర అవత రణ కోసం నిరాహార దీక్ష చేపట్టిన పొట్టి శ్రీరాములుకు కమ్యూ నిస్టులు గతంలో మద్దత్తు తెలిపిన విషయాన్ని గుర్తు చేశారు. తెలుగుదేశం, సిపిఐ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు విషయంలో దొంగాట ఆడుతున్నాయన్నారు. రాష్ట్ర విభజనకు మద్దత్తు తెలిపిన ఆ పార్టీలు నేడు సమైక్య నినాదం చేయడం విడ్డూరంగా వుందని దుయ్యబట్టారు. ఈ కార్యక్ర మంలో సిపిఎం జిల్లా కార్యవర్గ సభ్యుడు పి.శ్రీరాములు, డివి జన్ కార్యదర్శి తాళ్లూరి మాల్యాద్రి, మండల కార్యదర్శి కాకు మాను చిన్న వెంకయ్య, చల్లా నరహరి, దేవరాల రత్తయ్య, వెం కయ్య తదితరులు పాల్గొన్నారు.



సమైక్యాంధ్రకు మద్దతుగా నెల్లూరు గాంధీబొమ్మ వద్ద జర్నలిస్టులు, ఎలక్ట్రానిక్ మీడియా ప్రతినిధులు నిర్వహించిన నిరసన ప్రదర్శనలో పాల్గొన్న పలువురు జర్నలిస్టులు.

# విద్యుత్ ఉత్పత్తికి ఆటంకాలు తొలిగాయి!

### ఎస్పీడిసిఎల్ సిఎండి దొర

జిల్లా రైతాంగానికి వ్యవసాయం కోసం ఎలాంటి ఆటం కాలు లేకుండా ఏడుగంటలపాటు విద్యుత్ సరఫరా చేయాలని ఎస్పీడిసిఎల్ సిఎండి హెచ్‌వై దొర ఆదేశించారు. రాష్ట్రంలో విస్తారంగా వర్షాలు కురవడంతో జలశయాలు నిం దుగా వున్నందున విద్యుత్ ఉత్పత్తికి ఎలాంటి ఇబ్బందులు లేవ న్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని వ్యవసాయానికి పూర్తిస్థాయిలో విద్యుత్ సరఫరా ఇవ్వాలన్నారు. జిల్లాకు వచ్చిన ఆయన జిల్లా కార్యాలయంతోపాటు వివిధ సబ్‌స్టేషన్లను పరిశీలించారు. అనం తరం ఆయన అధికారులతో సమావేశం అయ్యారు. జిల్లాకు కొత్తగా మరో 49 సబ్‌స్టేషన్లు మంజూరైనట్లు తెలిపారు. ఇందులో 17 సబ్‌స్టేషన్లకు స్థల పరిశీలన జరపాల్సి వుందన్నారు. జిల్లాలో ఎప్పుడైనా విద్యుత్ బిల్లులు చెల్లించేలా ఎనీటైమ్ పేమెంట్ సెం టర్లను ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. జిల్లాలోని కావలి, గూడూరు, వెంకటగిరి ప్రాంతాల్లో ఐటి ప్రాజెక్ట్‌ను ఏర్పాటు చేస్తున్నామని దీని వలన లైన్‌లాస్‌ను పూర్తిగా అరికట్టవచ్చ న్నారు. మీటర్లకు సిమ్‌కార్డులు అమర్చే విధానంపై మాట్లాడుతూ ముందుగా హైటెన్షన్ సర్వీసులకు సంబంధించి ఈ విధానాన్ని అమర్చి వాటి ద్వారా ఎన్నియూనిట్లు విద్యుత్ వాడకం అయ్యిందో గుర్తించి ఆ సమాచారాన్ని సెల్‌ఫోన్లకు మెసేజ్‌ల రూపంలో పంపిస్తామన్నారు. అలాగే పనిచేయని ట్రాన్స్‌ఫార్మర్‌ల స్థానంలో కొత్త వాటిని ఏర్పాటు చేయడంపై అధికారులకు సూచనలు చేశారు. పట్టణ పరిధిలో 24 గంటల్లోగా, గ్రామీణ ప్రాంతాల్లో 48 గంటల్లోగా కొత్త ట్రాన్స్‌ఫార్మర్‌లను ఏర్పాటు చేయాలన్నారు.

● ఆత్మగౌరవ యాత్ర పేరుతో

# చంద్రబాబు దగా!



### కావలి వైకాపా సమన్వయకర్త ప్రతాప్‌కుమార్‌రెడ్డి

అధికారం కోసం కాంగ్రెస్ అగ్రనాయకత్వం రాష్ట్ర విభజనకు పాల్పడితే దానికి మద్ద తుగా లేఖ ఇచ్చిన తెలుగుదేశం పార్టీ అధిపతి చంద్ర బాబు నాయుడు తెలుగు ప్రజల్లో చిచ్చు రగిల్చాడని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కావలి నియోజకవర్గ సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డి ఆరోపించారు. తెలుగు వారికి ద్రోహం చేసి, నేడు యాత్రలంటూ నాట కాలు ఆడుతున్న ఆయన్ను రాష్ట్రం నుంచి తరిమికొట్టాలని పిలుపునిచ్చారు. సమై క్యాంధ్ర ఉద్యమం భవిష్యత్ ప్రణాళికపై స్థానిక పార్టీ కార్యాలయంలో సమావేశం నిర్వహించారు. చంద్రబాబు నాయుడు ఆత్మగౌరవ యాత్ర ఎందుకు చేస్తున్నాడో ప్రజలకు స్పష్టం చేయాలన్నారు. ఆయన ఇచ్చిన లేఖకు తెలంగాణ ఇస్తున్నట్లు కేంద్ర ప్రభుత్వం ప్రకటించినందుకు ఈ యాత్రలు చేస్తున్నాడా అని ప్రశ్నించారు. ఆరు దశాబ్దాలపాటు ఒక్కటిగా వుండిన తెలుగు రాష్ట్రాన్ని, ప్రజలను ముక్కలు చేయాలని కేంద్రం చేస్తున్న ప్రయత్నాలకు, దీనికి సహకరిస్తున్న తెలుగుదేశం పార్టీ కుట్రలను తిప్పికొడతామని, సమైక్యాంధ్ర కోసం పోరాడుతామని స్పష్టం చేశారు.

# సమైక్యాంధ్రను కాంక్షిస్తూ పాదయాత్ర!

### కావలిలో సరికొత్త కార్యక్రమం

సమైక్యాంధ్ర సాధించేవరకు ప్రతి ఒక్కరూ గల్లీ నుంచి ఢిల్లీ వరకు వివిధ రూపాల్లో ఉద్యమించాలని సమైక్యాంధ్ర సాధన సమితి పిలుపు నిచ్చింది. రాష్ట్ర విభజన నిర్ణయాన్ని ఉప సంహరించుకోవాలని, తెలుగువారం దరిని ఒకటిగానే వుంచాలని డిమాండ్ చేస్తూ సమితి బోగోలు మండలం జువ్వలదిన్నె నుంచి కావలి వరకు పాదయాత్ర చేపట్టింది. సాధన సమితి అధ్యక్ష, కార్యదర్శులు నరసారెడ్డి, తిరి వీధి ప్రసాద్, దామిశెట్టి శ్రీనివాసుల నాయుడు, బాషా తదితరులు ఆంధ్ర రాష్ట్రం కోసం ప్రాణత్యాగం చేసిన అమర జీవి పొట్టిశ్రీరాములు తిరుగాడిన నేలైన జువ్వలదిన్నెకు చేరుకొని అక్కడ నుంచి ఈ పాదయాత్రను ప్రారంభించారు. ముందుగా పొట్టి శ్రీరాములు స్మారక భవ నంలో ఆయన విగ్రహానికి పూలమా లలు వేసి ఘన నివాళులు అర్పించారు. అనంతరం వారు మాట్లాడుతూ రాష్ట్రం కోసం ఆత్మార్పణ చేసిన పొట్టి శ్రీరా ములు స్ఫూర్తితో సమైక్యాంధ్ర ఉద్య మాన్ని కొనసాగించాలని ఉద్యమకారు లకు పిలుపునిచ్చారు. ఢిల్లీ పెద్దలు సీమాంధ్ర ప్రాంతంలో గత 50 రోజు లుకుపైగా జరుగుతున్న ఉద్యమాలతో నైనా కళ్లు తెరచి వాస్తవాలు గ్రహిం చాలని కోరారు. జువ్వలదిన్నె నుంచి ప్రారంభమైన ఈ పాదయాత్రలో పాల్గొనే వారికి అడుగడుగునా ఘనస్వాగతం పలికారు ప్రజలు. కోవూరుపల్లె, కడ నూతల గ్రామాల్లో ఎస్సీ, ఎస్టీ, మైనా ర్టీలు, ఐకెపి మహిళలు, వైద్య ఆరోగ్య శాఖ సిబ్బంది సంఘీభావం ప్రకటిం చారు. కావలి చేరుకొన్న ఈ పాదయాత్ర బృందానికి ఆర్డీఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి, ఎమ్మార్వో, ఎన్జీఓలు స్వాగతం పలికి అభినందించారు.



# అమ్మ హస్తానికి సమైక్య సెగ!

### పంపిణీ నిలచిన రేషన్ సరుకులు

సమైక్యాంధ్ర సెగ అమ్మ హస్తం పథకాన్ని తాకింది. జిల్లా వ్యాప్తంగా గల రేషన్ షాపులకు చేరా ల్సిన సరుకులు అందని పరిస్థితి ఏర్ప డుతోంది. తహశీల్దార్లు, ఇతర రెవిన్యూ సిబ్బంది అందరూ సమైక్యాంధ్ర ఉద్య మంలో పాల్గొంటుండడంతో అమ్మ హస్తం పథకం క్రింద అందించే సరు కుల పంపిణీ అస్తవ్యస్తంగా మారింది. జిల్లావ్యాప్తంగా 7లక్షల 82వేల 139 తెల్ల రేషన్‌కార్డులు వున్నాయి. 1886 రేషన్ షాపులు వున్నాయి. వీటి ద్వారా ప్రతి నెలా 11,250 మెట్రిక్ టన్నుల బియ్యం, 390 మెట్రిక్ టన్నుల చక్కెర, పామాయిల్, అలాగే గోధుమలు సర ఫరా కావాల్సి వుంది. రేషన్ డీలర్లు ప్రతి నెలా 10వ తేదీలోగా డిడిలు తీసి పం పితే దాని ప్రకారం పౌరసరఫరాల శాఖ జిల్లాలోగల స్టాక్ పాయింట్లకు అక్కడి నుంచి రేషన్ షాపులకు సరుకులను పంపుతుంది. నెల్లూరు, ఇందుకూరుపేట, కోవూరు, పొదలకూరు, బుచ్చి, వెంకట గిరి, గూడూరు, నాయుడుపేట, సూళ్లూ రుపేట, కావలి, ఆత్మకూరు, ఉదయగిరి, రాపూరుల్లో ఈ స్టాక్ పాయింట్లు వున్నాయి. డిప్యూటీ తహశీల్దార్లు, ఇతర సిబ్బంది ఈ సరుకుల పంపిణీ వ్యవ హారాలను పరిశీలించేవారు. అయితే జిల్లాలో ఎన్జీఓల ఆధ్వర్యంలో నడుస్తున్న సమైక్యాంధ్ర ఉద్యమంలో రెవిన్యూ సిబ్బంది ఉధృతంగా పాల్గొంటుండ డంతో స్టాక్ పాయింట్లలో సిబ్బంది లేక సరుకుల సరఫరా గాడి తప్పింది. దీంతో రేషన్ షాపుల్లో ప్రభుత్వం అందించే వివిధ సరుకులు అందక వినియోగ దారులు ఇబ్బందులు పడుతున్నారు.


సమైక్యాంధ్రకు మద్దతుగా కావలిలో ఆర్టీసి ఉద్యోగులతో కలసి బస్సును లాగుతున్న ఆర్టీఓ సుబ్రహ్మణ్యంరెడ్డి, ఆత్మకూరు బ్రహ్మయ్య, అమరా వేదగిరి తదితరులు.


సమైక్యాంధ్రకు మద్దతుగా బోగోలులో సంఘీభావ శాంతి యాత్రను నిర్వహిస్తున్న ఐక్య క్రైస్తవ సంఘాల నాయకులు డేవిడ్‌పాల్, సాల్మన్‌రాజు, మాధవరావు, నాగరాజు తదితరులు.

# కోనేరు పూడికతీత పేరిట స్వాహా!

## ఇస్కపాళెంలో ఉపాధి హామీ నిధులు బొక్కేశారు.

వెంకటాచలం మండలం ఇస్కపాళెంలో కోనేరు పూడికతీత పేరుతో ఉపాధిహామీ సిబ్బంది అక్రమాలకు పాల్పడ్డారు. దాదాపు 60వేల రూపాయలను దోచేసినట్లు సమాచారం. కూలీలు కోనేరు పూడికతీత పనులు చేయకపోయినా చేసినట్లు చూపి రికార్డుల్లో నమోదు చేసి ఉఁటఉడియంగా ఈ మొత్తం దిగమింగారట. ఇది బయటకు పొక్కడంతో మండలంలో కలకలం రేగింది. ఉపాధి కూలీలు ఎవరూ తాము పూడిక తీయలేదని చెప్పడం ఈ అక్రమాలను తెలియజెప్పింది. 290 మంది కూలీలు ఈ పని చేశారని, ఒక్కో కూలీకి 195 రూపాయల నుంచి 234 రూపాయలు చెల్లిస్తున్నట్లు రికార్డుల్లో నమోదు చేశారట. 60వేల రూపాయలు ఈ విధంగా డ్రా చేసుకొన్నారట. ఫీల్డ్ అసిస్టెంట్లు, మేస్త్రీలు కుమ్మక్కై ఈ నిధుల దుర్వినియోగానికి పాల్పడినట్లు సమాచారం.

# జగన్‌ను చూసి వణుకుతున్న చంద్రబాబు!

## కలువాయిలో కాకాణి గోవర్ధన్‌రెడ్డి

వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని చూసి, ప్రజల్లో ఆయన పట్ల వున్న అభిమానాన్ని చూసి తెలుగుదేశం పార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు వణికిపోతున్నాడని, అందుకోసమే జగన్‌ను జైలు నుంచి బయటకు రాకుండా చూసేందుకు తన శక్తియుక్తులన్నీ ప్రయోగించి విఫలమయ్యాడని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సర్వేపల్లి నియోజకవర్గ సమన్వయకర్త కాకాణి గోవర్ధన్‌రెడ్డి విమర్శించారు. ఢిల్లీ వెళ్లి కాంగ్రెస్ అధినేత్రి సోనియా గాంధీ, ఆర్థికమంత్రి చిదంబరంతో రహస్య మంతనాలు సాగించాడని ఆరోపించారు. ఇటీవల ఆయన కొమ్మి లక్ష్మయ్యనాయుడుతో కలసి కలువాయి, పొదలకూరు తదితర ప్రాంతాల్లో పర్యటించారు. కలువాయి మండలంలోని దాచూరు గ్రామానికి చెందిన మంత్రి ఆనం అనుచరులు కొమ్మి, కాకాణి సమక్షంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరారు. ఈ సందర్భంగా కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ చంద్రబాబు ఢిల్లీ యాత్ర, కాంగ్రెస్‌తో రహస్య మంతనాలపై ఆ పార్టీ నేత పయ్యావుల కేశవ్ స్పష్టంగా తెలియజేశారన్నారు. ఎవరు ఎన్ని అడ్డంకులు సృష్టించినా, న్యాయస్థానంలో జగన్‌కు బెయిల్ రావడం పట్ల సంతోషం వ్యక్తం చేశారు.



● చిత్తూరుకు

# నీటిని తరలిస్తే ప్రాణత్యాగం!

## వెంకటగిరి ఎమ్మెల్యే శపథం

కండలేరు నుంచి నీటి తరలింపుకు ప్రయత్నిస్తే ప్రాణత్యాగం చేస్తానని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ హెచ్చరించారు. జిల్లా ప్రజల నోరు కొట్టి చిత్తూరుజిల్లాకు తరలించేందుకు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రయత్నిస్తున్నారని, ఇందుకు ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి సహకారం అందజేయడం దారుణమన్నారు. గతంలో మద్రాసుకు నీటిని తరలించడాన్ని నిరసిస్తూ కణతకు తుపాకి గురిపెట్టుకొన్న ఆనం రామనారాయణరెడ్డి నేడు జిల్లా రైతాంగానికి ద్రోహం చేయడం ఆయన స్వార్థానికి నిదర్శనం అన్నారు. ఈ ప్రాజెక్ట్‌కు నిధులు మంజూరు చేయడంలో మంత్రికి ఏమి ప్రయోజనం వుందోనని అనుమానం వ్యక్తం చేశారు. 10 టిఎంసిల నీటిని పైపులైన్ ద్వారా చిత్తూరుకు తరలిస్తే ఈ ప్రాంతం ఎడారిగా మారుతుందన్నారు. జల దోపిడీని అడ్డుకొనేందుకు ప్రతి ఒక్కరూ త్యాగాలకు సిద్ధం కావాలన్నారు. జిల్లా ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా చిత్తూరుకు నీటిని తరలిస్తే తుపాకీతో కాల్చుకొనేందుకు వెనుకాడనన్నారు.



● గ్రామాల్లో

# క్షీణించిన పారిశుధ్యం!

## పెచ్చుపెరిగిన జ్వరాలు

విష జ్వరాలు ప్రబలుతుండడంతో కావలి నియోజకవర్గ పరిధిలోని పలు ప్రాంతాల్లోని ప్రజలు అనారోగ్యానికి గురై ఆస్పత్రుల పాలవుతున్నారు. పలు గ్రామాలు, పంచాయతీల్లో పారిశుధ్యం క్షీణించడం, తాగునీరు కలుషితం అవుతుండడంతో ప్రజలు రోగాల బారిన పడుతున్నారు. సమైక్యాంధ్ర ఉద్యమ ప్రభావం గ్రామాలపై పడుతోంది. పంచాయతీ కార్యదర్శులు లేకపోవడం, రెండు మూడు పంచాయతీలకు కలిపి ఒకే కార్యదర్శి ఇన్‌ఛార్జిగా వ్యవహరిస్తుండడం తదితర కారణాలు ప్రజలు పాలిట శాపాలయ్యాయి. దగదర్తి, కావలి, బోగోలు, అల్లూరు మండలాల్లోని ప్రజలు వ్యాధుల బారిన పడుతున్నారు. దగదర్తి మండల పరిధిలోని కౌరుగుంట, ఉలవపాళ్ల, దగదర్తి, తడకలూరు, మనుబోలుపాడు, కాట్రాయపాడు, చెన్నూరుల్లో పారిశుధ్యం అస్తవ్యస్తంగా వుంది. బోగోలు మండలంలోని విఎన్ఆర్‌పేట, ఎబికండ్రిగ, జక్కేపల్లిగూడూరు, తాళ్లూరు, కొండబిట్రగుంట, ఏనుగుల బావి, ముంగమూరుల్లో పరిస్థితి అధ్వాన్నంగా వుంది. చెత్తను సరిగా ఎత్తకపోవడం, మురుగు కాలువలను శుభ్రపరచక పోతుండడం, తాగునీటి సరఫరా అస్తవ్యస్తంగా వుండడం, నీరు కలుషితం అవుతుండడంతో అతిసారకు గురయ్యేవాళ్లు, విషజ్వరాలతో ఆస్పత్రులకు వెళ్లేవారి సంఖ్య రోజురోజుకూ అధికమవుతోంది. అధికారులు పరిస్థితి తీవ్రతను అర్థం చేసుకొని గ్రామాల్లో పారిశుధ్య పరిస్థితులు మెరుగుపరచాలని పలు ప్రాంతాల ప్రజలు కోరుకొంటున్నారు.

# నకిలీ డాక్టర్ల హవా!

## మోసపోతున్న గ్రామీణులు

కావలి, ఉదయగిరి నియోజకవర్గాల్లోని పలు ప్రాంతాల్లో నకిలీ డాక్టర్లు, వైద్యశాస్త్రపరంగా ఎలాంటి అర్హతలేని డాక్టర్లు ఇబ్బడిముబ్బడిగా క్లినిక్‌లు ఏర్పాటు చేసుకొని అమాయక ప్రజలను, అక్షరజ్ఞానంలేని వారిని నమ్మించి చికిత్సల పేరుతో మోసం చేసేవారి సంఖ్య అధికమవుతోంది. కావలి పట్టణంలోని రైల్వే రోడ్డు, క్రిస్టియన్ పేటల్లో మొలలకు చికిత్సఅంటూ రోగులను మోసం చేస్తున్న నకిలీ వైద్యుల బండారం వైద్య ఆరోగ్యశాఖ అధికారుల దాడితో బట్టబయలైన విషయం తెలిసిందే. ఇలాంటి నకిలీ డాక్టర్లు, వైద్యులమంటూ బోర్డులు పెట్టుకొని మొలలు ఇతరత్రా సమస్యలకు ఆపరేషన్ లేకుండా వైద్యం చేస్తామని చెప్పి వేలాది రూపాయలు గుంజేవాళ్లు అధికం అయ్యారు. కావలి రూరల్ మండలం, దగదర్తి, బోగోలు, అల్లూరు, ఉదయగిరి నియోజకవర్గ పరిధిలోని జలదంకి, కలిగిరి, సీతారాంపురం, బ్రాహ్మణక్రాక, కొండాపురం ప్రాంతాలతోపాటు హసనాపురం, ఎఎస్‌పేట, కావలియడవల్లి, శ్రీకొలను, ఆత్మకూరు, కోవూరు, కావలి పట్టణంలోని వివిధ ప్రాంతాల్లో నిబంధనలకు విరుద్ధంగా క్లినిక్‌లు నిర్వహిస్తున్న నకిలీ డాక్టర్లు ఎంతో మంది వున్నారు. ఈ క్లినిక్‌లకు ప్రభుత్వ ఆస్పత్రులు, వైద్య ఆరోగ్య కేంద్రాల్లోని సెలైన్లు, మందులు అక్కడి వైద్య సిబ్బంది తెచ్చి అమ్మేస్తుండడం చాలాకాలంగా జరుగుతున్న తంతు. వాటన్నింటిపై జిల్లా వైద్య ఆరోగ్యశాఖ అధికారులు తనిఖీలు జరిపితే మరికొంతమంది నకిలీ డాక్టర్లు, అక్రమార్కుల బండారం వెలుగు చూస్తుంది.

# సీమాంధ్రలో ఉద్యమాన్ని విస్మరించం!



సీమాంధ్రుల సమస్యలను పరిష్కరించకుండా రాష్ట్ర విభజనకు మద్దతిస్తే అది ఆ ప్రాంత ప్రజల పాలిట మరణ శాసనం అవుతుందని బిజెపి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి ఆందోళన వ్యక్తం చేశారు. రాష్ట్ర విభజన సీమాంధ్ర ప్రాంత ప్రజల సమస్యలు, వారి మనోభావాలు తెలుసుకోకుండా కాంగ్రెస్ పార్టీ ఏకవాక్యంతో విభజనకు సిద్ధపడడాన్ని తప్పుపట్టారు. అన్ని రాజకీయ పార్టీలు సీమాంధ్రలో ఇంత వువ్వెత్తున ఉద్యమ జ్వాలలు ఎగసిపడతాయని వూహించలేక పోయాయని తెలిపారు. సీమాంధ్రలో జరుగుతున్న ఉద్యమాన్ని విస్మరించడం ద్రోహమేనన్నారు. బిజెపి జిల్లా కార్యాలయంలో ఆయన సమైక్యాంధ్ర ఉద్యమంపై విలేకరులతో మాట్లాడారు. ప్రస్తుత పరిస్థితుల్లో సీమాంధ్రులకు రక్షణ కరవైందన్నారు. పార్లమెంటులో ప్రవేశపెట్టే బిల్లులో సీమాంధ్ర ప్రాంత ప్రజల ప్రయోజనాలు కాపాడే విధంగా బిల్లు వుండాలన్నారు. అలాంటి బిల్లుకే బిజెపి మద్దత్తు ఇచ్చే విధంగా పార్టీ నాయకత్వంపై ఒత్తిడి తెస్తామన్నారు.



# హోమానికున్న శక్తి అమోఘం!

పంచ భూతాలలో అగ్ని ఒకటి. ప్రకృతి శక్తి అయిన అగ్నిని ఉపయోగించి పూజాధికాలు నిర్వహించడం అనాదిగా వస్తున్న సాంప్రదాయం. పంచభూతాల్లోని అగ్నికి దేవతాస్థానం ఇచ్చి ఆరాధించడం హైందవ సాంప్రదాయంలో వుంది. దీనినే హోమం అంటారు. హోమానికున్న శక్తిని మహర్షులు పలు సందర్భాలలో వివరించి వున్నారు. మునులు, రుషుల ఆధ్వర్యంలో లోక కళ్యాణం కోసం ఎన్నో హోమాలను నిర్వహించిన విషయం పురాణాలలో చెప్పబడి వుంది. అంతటి పవిత్రత, శక్తి హోమానికి వుంది. ఆది కాలం నుంచి, పురాణ కాలం నుంచి వున్న హోమ సంస్కృతి నేటికీ మన దేశంలో హిందూ సాంప్రదాయంలో కొనసాగుతూనే వుంది.

మనలోని మాలిన్యాన్ని ప్రకృతి సహజంగా తొలగించే విధానమే హోమం. వేదాలలో హోమం గురించి, హోమ విధానాల గురించి వర్ణింపబడి వుంది. హోమం చేయడాన్ని చాంధసంగా కొంతమంది కొట్టి పారేస్తున్నప్పటికీ వాస్తవానికి హోమానికున్న శక్తి, హోమం చేయడం వలన కలిగే ఆయురారోగ్యాలను శాస్త్ర గ్రంధాలలో వివరించబడింది. హోమం అంటే అగ్నిహోత్రం మాత్రమే కాదు. దాని వెనుక విశేష లక్ష్యం వుంది. హోమం చేయడం ద్వారా ఆరోగ్యం లభించడంతోపాటు ఆయుర్ధాయం కల్గుతుంది. బాహ్య, అంతర్గత స్వచ్ఛత హోమాల ద్వారా లభిస్తుంది. నేడు ప్రచారంలో వున్న మానసిక శాస్త్రం, ఆక్యుప్రెజర్, టచ్ ఫీలింగ్, ధ్యానం వంటివన్నీ ఈ హోమంలో కలగలసి వుండడం విశేషం. అందుకే హోమాన్ని సాంప్రదాయక, వైజ్ఞానిక కలబోతగా చెబుతారు. జీవశక్తిని అందించేది అగ్ని. అలాంటి శక్తిని హోమం జరపడం ద్వారా పరోక్షంగా మనం వినియోగించుకొంటున్నాం. ఆరోగ్యం కోసం కాచి చల్లార్చిన నీటిని తాగమంటారు వైద్యులు. అగ్నితో వచ్చే వేడి వలన నీటిలోని రోగకారకమైన సూక్ష్మజీవులు సంహరించబడతాయి. అదే విధంగా అగ్ని వెలిగించిన చోటుకు సూక్ష్మజీవులు చేరవు. ఒక ప్రదేశంలో రోజుల తరబడి అగ్నిని వెలిగించడం వలన, హోమం చేయడం వలన దాని శక్తికి పరిసరాల్లోని హానికర సూక్ష్మజీవులన్నీ నశించి మనిషికి చక్కని ఆరోగ్యం అందుతుంది. ఆవు నెయ్యి, అత్తి, రాగి, మద్ది, మోదుగ, ఉత్తరేణి పుల్లలు హోమానికి వినియోగిస్తారు. అగ్ని దేవుడిని ఆరాధించిన అనంతరం హోమాన్ని ప్రారంభిస్తారు. ఇష్ట దైవాన్ని ప్రార్థించి కార్యక్రమాన్ని జరుపుతారు. హోమ సమయంలో పఠించే మంత్రాలు, హోమ గుండంలో వేసే సామాగ్రి వలన ఆ ప్రాంతం ఆధ్యాత్మిక శోభను సంతరించుకొంటుంది. హోమం నుండి వెలువడే వాయువుల ప్రభావంతో పరిసరాలు శుభ్రం కావడంతోపాటు మానసిక ప్రశాంతత లభిస్తుంది అందుకే పలు సందర్భాలలో హోమాన్ని ప్రత్యేకంగా జరుపుతుంటారు.



## అవినీతి పుట్ట పగిలింది


సెంట్రల్ డ్రగ్ స్టోర్‌లో మందులు తనిఖీ చేస్తున్న ఎసిబి డిఎస్పీ భాస్కర్‌రావు.

● నెల్లూరు సెంట్రల్ డ్రగ్ స్టోర్‌లో...

# మందుల గోల్మాల్!

**పెద్దాస్పత్రిలోని సెంట్రల్ డ్రగ్ స్టోర్‌ను ఎసిబి అధికారులు ఆకస్మికంగా తనిఖీ చేయగా స్టోర్‌లో నిల్వ వున్న మందులు, ఇతర పరికరాలు రికార్డుల్లో నమోదు చేయబడిన వివరాలకు చాలా వ్యత్యాసం వున్నట్లు గుర్తించారు.**

జిల్లా ప్రభుత్వ ప్రధాన వైద్యశాల ప్రాంగణంలో వున్న సెంట్రల్ డ్రగ్ స్టోర్‌లో అవినీతి నిరోధక శాఖ అధికారుల దాడులతో అక్రమాలు వెలుగు చూశాయి. డ్రగ్ స్టోర్‌తోపాటు ప్రభుత్వ వైద్యశాలలో పలు రికార్డులను ఎసిబి బృందం తనిఖీలు చేసింది. డ్రగ్ స్టోర్‌లో నిల్వ వుంచిన మందులు, ఇతర పరికరాలకు, రికార్డుల్లో నమోదు చేయబడిన వివరాలకు చాలా వ్యత్యాసం వుందన్న విషయాన్ని అధికారులు గుర్తించారు. ఉదయం 9 గంటలకు ఆస్పత్రికి చేరుకొన్న ఎసిబి అధికారులు బృందాలుగా ఏర్పడి తనిఖీలు, రికార్డుల పరిశీలన జరిపారు. సెంట్రల్ డ్రగ్ స్టోర్ నుంచి జిల్లాలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు అవసరమైన మందులు, సెలైన్లు సరఫరా అవుతుంటాయి. జిల్లా అవసరాలకు సంబంధించి వివిధ ఫార్మా కంపెనీల నుండి కొటేషన్లు తీసుకుని ధరలలో వ్యత్యాసాన్ని గమనించి ఏ కంపెనీ తక్కువ ధరకు మందులు సరఫరా చేస్తుందో దానిని పరిగణనలోకి తీసుకొని ఆర్డర్ ఇవ్వాల్సి వుంటుంది.

డ్రగ్ స్టోర్ నిర్వాహకులు మందుల కొనుగోలుకు సంబంధించి కొటేషన్లు లేకుండానే కొన్ని మందుల కంపెనీల నుండి అధిక ధరలకు మందులు కొనుగోలు చేయడం వివాదాస్పదంగా మారింది. జిల్లా జాయింట్ కలెక్టర్ ఆధ్వర్యంలో కొనుగోలు కమిటీ వుంది. టెండర్ ద్వారా గానీ, కొటేషన్లు ద్వారా గానీ కంపెనీలకు ఆర్డర్లు ఇవ్వాలి. కానీ ఇక్కడ నిబంధనలకు విరుద్ధంగా కొనుగోలు చేయడాన్ని ఎసిబి గుర్తించి కొన్ని రికార్డులను మరింత పరిశీలన జరిపేందుకు స్వాధీనం చేసుకోవడం జరిగింది. కొనుగోలు చేయబడిన మందులు, ఇతర సర్జికల్ పరికరాలను సకాలంలో వినియోగించకపోవడంతో అవి పనికి రాకుండాపోయే అవకాశం వుందని కొందరు వైద్యులు చెబుతున్నారు. వైద్య ఆరోగ్యశాఖ అధికారులు గానీ, వైద్య విధానపరిషత్ అధికారులు గానీ సెంట్రల్ డ్రగ్ స్టోర్‌లోని మందుల కొనుగోలు, నిల్వలపై ఏనాడు తనిఖీ చేపట్టిన దాఖలాలు కనిపించలేదు. డ్రగ్‌స్టోర్ అధికారుల పనితీరుపై అనేక ఆరోపణలు రావడంతో ఎసిబి అధికారులు దాడులు చేశారు. రెండు నెలల క్రితం సెంట్రల్ డ్రగ్ స్టోర్ నుండి ఇందుకూరుపేట మండలం జగదేవిపేట ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి కొన్ని మందులు సరఫరా అయ్యాయి. ఇండెంట్ కంటే అధికంగా రెండు అట్టపెట్టెల్లో మందులు వెళ్లాయి. దీనిని గమనించిన అక్కడి వైద్యుడు అదనంగా వచ్చిన రెండు పెట్టెలను ప్రత్యేక గదిలో భద్రపరచాలని వాచ్‌మెన్‌ను కోరాడు. పిహెచ్‌సిలో రెండు రోజుల తర్వాత భద్రపరచిన రెండు అట్టపెట్టెలు అదృశ్యం అయ్యాయి. దీనిపై ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేయడం, విచారణ జరగడం జరిగిపోయాయి. డ్రగ్‌స్టోర్‌లో పని చేసే ఓ మహిళా ఉద్యోగిని కావాలనే అదనంగా రెండు అట్టపెట్టెల్లో విలువైన మందులను వుంచి సరఫరా చేసిందన్న ఆరోపణలున్నాయి. డ్రగ్ స్టోర్‌లో అదనంగా నిల్వ వుంచిన మందులను పై విధంగా బయటకు తరలించి సొమ్ము చేసుకొంటున్నారన్న ప్రచారం వుంది. ఎన్నో సంవత్సరాల నుండి ఇక్కడ అవినీతి, అక్రమాలు జరుగుతున్నా ఎవరూ నియంత్రించలేకపోతున్నారు. పెద్దాస్పత్రికి ఎవరు సూపరింటెండెంట్‌గా వుంటే వారే సెంట్రల్ డ్రగ్ స్టోర్ ఇన్‌ఛార్జిగా వ్యవహరిస్తారు. గతంలో ఇక్కడ పని చేసిన సూపరింటెండెంట్‌లు క్రింది స్థాయి సిబ్బందికి బాధ్యతలు అప్పగించి వారు కేవలం సంతకాలు చేసేందుకే పరిమితమైనారు. ఇటీవల అవినీతి నిరోధక శాఖకు వైద్య ఆరోగ్యశాఖ, వైద్య విధానపరిషత్‌పై ఫిర్యాదులు వెళ్లడంతో ఆ శాఖ డిఎస్పీ నిఘా పెట్టి దాడులు చేశారు. సెంట్రల్ డ్రగ్ స్టోర్‌లో మందుల కొనుగోలు చేయడం, అవసరానికి వినియోగించకపోవడం వల్ల కోట్ల రూపాయలు ప్రభుత్వానికి నష్టం వాటిల్లినట్లు తేలింది.

# సణుగుడు

## * జగన్ తప్పు చేసినట్లా, చేయనట్లా?

జగన్ జైలు నుంచి విడుదలైనాడు. బెయిల్ తెచ్చుకొన్నాడు. ఏ నిందితుడికైనా ఏదో ఒక దశలో బెయిల్ ఇచ్చి తీరాలి. న్యాయ ప్రక్రియలో అదొక తప్పనిసరి భాగం. న్యాయస్థానంలో నేరం రుజువై, శిక్ష పడినప్పుడు కూడా బెయిల్ రావడానికి ముందు జైలులో గడిపిన కాలాన్ని లెక్కించి, ఆ మిగతాకు మాత్రమే శిక్ష విధిస్తారు. సాధారణ పరిస్థితులలో జగన్కు బెయిల్ రావడం పెద్ద విశేషం కాదు. కానీ ఆ కేసు చుట్టూ అల్లుకొని వున్న రాజకీయ అంశాల కోణంలో నుంచి చూస్తే మాత్రం ఈ బెయిల్‌కు చాలా ప్రాధాన్యత వుంది.

జగన్ మీద ఆరోపించిన నేరాలలో మొదటిది నీకిది నాకిది అనే ధోరణిలో (క్విడ్ ప్రోకో) ప్రభుత్వ ఆస్తులను ప్రైవేట్ వ్యక్తులకు కట్టబెట్టి లబ్ది పొందడం; రెండవది నల్లధనాన్ని తెల్లధనంగా మార్చుకోవడం కోసం అక్రమ లావాదేవీలు నడిపే మనీల్యాండరింగ్ నేరం. మొదటి దానికి చట్టంలో చాలా మినహాయింపులున్నాయి. ఆ నేరం మీద అయితే జగన్ ఇన్ని రోజులు జైలులో గడపవలసిన అవసరం లేదు. మొదటి వారంలోనే బయటకు వచ్చేసి వుండాలి. కానీ మనీల్యాండరింగ్ మాత్రం అత్యంత కఠినమైన చట్టం. జగన్ మీద ఆ నేరం వుందని సిబిఐ పదే పదే న్యాయ స్థానాలకు విన్నవించింది. కానీ వారు దాఖలు చేసిన 10 ఛార్జిషీట్లలో ఆ నేరాన్ని ప్రస్తావించనే లేదు. దానికి సంబంధించినవిగా చెప్తుండిన సూట్‌కేసు కంపెనీలను పూర్తిగా విస్మరించారు. వాటితో నిమిత్తం లేకుండా దర్యాప్తు ముగిసిందని ప్రకటించారు. అంటే సిబిఐ ఇంత కాలం చెప్తూ వచ్చిన మనీ ల్యాండరింగ్ నేరానికి జగన్ పాల్పడలేదని అర్థం చేసుకోవాలా? అదే నిజమైతే ఆ చట్టాన్ని చూపించిన 16 నెలలపాటు ఆయనున్న జైలులో ఎందుకు పెట్టారు? బెయిల్ దరఖాస్తు చేసినప్పుడల్లా కొమ్ములు తిరిగిన సుప్రీం కోర్టు న్యాయవాదులను ఎందుకు వినియోగించారు?

జగన్ అక్రమార్జన 40వేల కోట్ల రూపాయల వరకు వుందని సిబిఐ అధికారులు మొదట్లో లెక్కలు చెప్పారు. కానీ వారు దాఖలు చేసిన ఛార్జిషీట్లన్నీ కలిపితే, రెండు మూడు వందల కోట్ల రూపాయల మొత్తం కూడా రావడం లేదు. అంటే మిగతా అక్రమార్జన జగన్ చేయలేదనా లేక దాన్ని సిబిఐ తన కేసుల పరిధి నుంచి తప్పించిందనా?

మనీ ల్యాండరింగ్ చట్టం క్రింద అరెస్ట్ అయిన వారు మూడు నాలుగు సంవత్సరాలపాటు జైలులో మ్రగ్గడం పరిపాటి. జార్ఖండ్ మాజీ ముఖ్యమంత్రి మధుకోడా, గుర్రాల వ్యాపారి హసన్ అలీ వంటి వారు ఎన్నేళ్ల పాటు బెయిల్ రాక విలవిల లాడిందీ మనకు తెలుసు. కానీ జగన్ 16 నెలల్లో బయట పడ్డాడు. అంటే దాని అర్థం జగన్ మీద ఆ చట్ట ప్రకారం కేసు పెట్టలేదనే కదా? అది దేని వల్ల? ఆయన ఆ నేరం చేశాడన్న రుజువు దొరకలేదా, లేక సామాన్య జనానికి అర్థం కాని రాజకీయ మర్మాల ఫలితంగా ఆ నేరాన్ని పాతర పెట్టారా?

### డోలేంద్ర

సిబిఐకి ఎంత ప్రతిష్ట వుందో అంతే అప్రతిష్ట కూడా వుంది. రాజీవ్ గాంధీ హంతకులను అత్యంత వేగంగా పట్టుకోవడం వంటి ఉదంతాలు సిబిఐ ప్రతిభను అంతర్జాతీయ స్థాయిలో ఆకాశమంత ఎత్తుకు పెంచాయి. కానీ రాజకీయ వాదుల నేరాలకు సంబంధించిన ప్రతి కేసులోనూ అదే సిబిఐ గబ్బుపట్టిపోతున్నది. అధికారంలో వున్న వారి రాజకీయ అవసరాలకు అనుగుణంగా మాత్రమే సిబిఐ పని చేస్తుందనే చెడ్డ పేరు వుంది. ఆ ఆరోపణ నిజమని మరొకసారి రుజువు చేశారిప్పుడు.

జగన్ అవినీతి జగమెరిగిన సత్యం. వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రి అయ్యే నాటికి వారి కుటుంబానికి అప్పులు తప్ప ఆస్తులు లేవు. బంజారాహిల్స్‌లో వుండిన స్వంత ఇంటిని అమ్ముకొని, 2004 ఎన్నికలకు ఖర్చు చేశాడు వైఎస్. అది ఆయనే చెప్పిన నిజం. కానీ ఈ రోజు జగన్‌కు ఊరికొక రాజప్రసాదం వుంది. వేల కోట్ల పెట్టుబడులున్న పరిశ్రమలు, కంపెనీలు వున్నాయి. వందల కోట్లలో బాడుగలు వచ్చే కమర్షియల్ కాంప్లెక్సులు వున్నాయి. రాజకీయాల కోసం, సాక్షి పత్రిక కోసం ఆయన చేస్తున్న ఖర్చు వందల కోట్లలో వుంది. ఇదంతా సక్రమంగా సంపాదించిన సొత్తు అని ఎవరూ నమ్మరు. జగన్‌ను అభిమానించే వారు కూడా జగన్ అక్రమాలకు పాల్పడడం లేదని భావించడం లేదు. రాజకీయాలలో అక్రమాలు చేయని వారు ఎవరనే వాదనతో జగన్ తప్పులను క్షమిస్తున్నారు. కానీ సిబిఐకి అటువంటి భావోద్వేగాలు వుండవలసిన అవసరం లేదు. వారి బాధ్యత చట్టాల పరిధిలో పని చేయడం మాత్రమే. కానీ ఆ బాధ్యత నిర్వర్తించడంలో సిబిఐ దారుణంగా విఫలమైంది. చట్టం పరిధిలో జగన్ తప్పు చేయలేదనే నిర్ధారణకు వారు వచ్చి వుంటే, ఆ కేసును ఇంత కాలం సాగదీయవలసిన అవసరం లేదు.

ఢిల్లీ పెత్తందారులతో జగన్ కుటుంబం చేసుకొన్న రాజీ వల్లనే సిబిఐ ఆయన్ను బేషరతుగా వదలి పెట్టిందనే విమర్శ బాహాటంగానే వినవస్తున్నది. చంద్రబాబు వంటి నిత్య విమర్శకులు ఒక్కరు ఈ మాట మాట్లాడితే లెక్క చేయబనిలేదు. కానీ జగన్‌తో సఖ్యత కోసం చాలా ప్రయత్నాలు చేసిన బిజెపి కూడా జాతీయస్థాయిలో ఈ ఆరోపణ చేస్తున్నది.

సిబిఐ వంటి సంస్థలు ఇంత బలహీనంగా, ఇంత దుర్భలంగా, ఇంత నిస్సహాయంగా, ఇంత నిర్లజ్జగా రాజకీయ ప్రేరణలకు లొంగిపోతే ఇక దేశంలో నేర దర్యాప్తుల మీద ప్రజలకు నమ్మకం ఎట్లా మిగులుతుంది? న్యాయ వ్యవస్థ మీద విశ్వాసం ఎట్లా నిలుస్తుంది?

జగన్ సాధారణ వ్యక్తి కాదు. రాష్ట్రంలో కోట్లాది మంది నిత్యం ఆయన గురించి చర్చించుకొంటూ వుంటారు. లక్షల సంఖ్యలో అభిమానులు, అంతే సంఖ్యలో విమర్శకులు వున్నారు. 2014 ఎన్నికల తర్వాత జాతీయ రాజకీయాలలో జగన్ చాలా కీలక భూమిక పోషించ బోతున్నాడు. ఇప్పటికిప్పుడు రాష్ట్ర రాజకీయాలన్నీ జగన్ చుట్టూ తిరుగుతున్నాయి. అంత ప్రాధాన్యత కల్గిన వ్యక్తి విషయంలో సిబిఐ వంటి జాతీయ నేర పరిశోధన సంస్థలు చాలా మెలుకువతో మెలగాలి. ఆచితూచి అడుగులు వేయాలి. తమను కొన్ని కోట్ల కళ్లు చూస్తున్నాయన్న నిజాన్ని అర్థం చేసుకొని వళ్లు దగ్గర పెట్టుకొని పని చేయాలి. కానీ దురదృష్టవశాత్తు సిబిఐ వైఖరి చాలా అసమంజసంగా వుంది. అసభ్యంగా వుందని చెప్పినా తప్పు కాదు. జగన్ విషయంలో ఏది సత్యమో ఏది అసత్యమో, ఏది నేరమో, ఏది నిందో, ఏది అక్రమమో, అది అభూత కల్పనో ప్రజలకు అర్థం కాని రీతిలో ఈ కేసును గాలికి వదిలేశారు అధికారులు. అందుకు కారణాలు ఏవైనా కావచ్చు. కానీ దానివల్ల ప్రజలలో న్యాయవ్యవస్థ మీదనే విశ్వాసం సన్నగిల్లి పోతుంది.

సంపన్నుడు వ్యభిచారం చేస్తే సరసం, సామాన్యుడు చేస్తే రంకు అనేది మన సమాజ పోకడ. సిబిఐ ఆ లోకం తీరును మరొకసారి నిర్ధారించింది. రాజకీయ పలుకుబడి వుంటే, న్యాయాన్ని కొనగల స్తోమత కల్గి వుంటే చట్టాలు, నేర విచారణలు నిష్ఫలం అనే అభిప్రాయాన్ని ప్రజలకు కల్గించింది సిబిఐ. నిజం చెప్పాలంటే ఇప్పుడు జగన్ కంటే ముందుగా సిబిఐ మీద విచారణ జరిపించవలసిన అవసరం కన్పిస్తున్నది. వారు నేరస్తులకు కొమ్ము కాస్తున్నారా లేక నేరాలను నిస్పక్షపాతంగా విచారణ చేస్తున్నారా అన్న నిజం ప్రజలకు తెలియాలంటే సిబిఐ తీరు మీద విచారణ జరిపించాలి.




జేసీస్ గ్రాండ్ డే సందర్భంగా డాక్టరుగా విశిష్టుడు హైదరాబాద్ గ్లోబల్ హాస్పిటల్ ఛైర్మన్ డాక్టర్ కంచర్ల రవీంద్రనాథ్‌ను సన్మానిస్తున్న నెల్లూరు జేసీస్ సంస్థ అధ్యక్షుడు శ్రీనివాసులు.



వైఎస్‌జగన్‌కు సిబిఐ కోర్టు బెయిలిచ్చిన సందర్భంగా కావలిలో ఆ పార్టీ కార్యకర్తలు నిర్వహించిన ర్యాలీలో మాట్లాడుతున్న వైకాపా సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.



వైఎస్‌జగన్‌కు బెయిలివ్వడంతో నెల్లూరు పురవీధుల్లో బైక్ ర్యాలీని నిర్వహిస్తున్న వైకాపా నెల్లూరు సిటీ సమన్వయకర్త అనిల్‌కుమార్ యాదవ్.



సమైక్యాంధ్రకు మద్దతుగా నెల్లూరు ముస్లింలు నిర్వహించిన ర్యాలీలో పాల్గొన్న ఆనం జయకుమార్‌రెడ్డి.

# వారఫలాలు

*తేది 28-9-2013 నుండి 4-10-2013 వరకు మేషంలో కేతువు; మిథునంలో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో రవి; తులలో బుధ, శని, రాహువులు, బుధుడు 2తేదీ వరకు తదుపరి వృశ్చికంలో; మిథున, కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

తలపెట్టిన పనులు ఆలస్యంగా జరుగుతాయి. అధిక ఖర్చులు. ప్రయత్నాలకు ఆటంకాలెదురైనా ధైర్యం వహించి, శ్రద్ధ పెట్టాలి. ఇంట్లో వివాహాది ప్రయత్నాలు, వృత్తి, వ్యాపార లావాదేవీలు చురుకుగా సాగుతాయి. ఉద్యోగుల బదిలీలు, ప్రమోషన్లకు గండి ఏర్పడుతుంది. విద్యార్థులకు చక్కటి అవకాశాలు. కళా, క్రీడాకారుల ఆర్థిక స్థితి గతంకన్నా మెరుగౌతుంది.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఆశలు నిరాశకాగల సూచనలున్నాయి. కుటుంబ విషయాలు రచ్చకెక్కకుండా జాగ్రత్తలవసరం. ఇతరులతో మాట్లాడేటప్పుడు జాగ్రత్తలవసరం. వృత్తి, వ్యాపారాలలో పెద్ద మొత్తాలతో కూడిన వ్యాపార పెట్టుబడులు వాయిదా వేయడం మేలు. క్రయవిక్రయాలు వాయిదా వేయకండి. ఆర్థిక లావాదేవీలు లాభిస్తాయి. నూతన భాంధవ్యాలు, శత్రువులపై ఆధిక్యత, భార్యాభర్తల మధ్య అనుకూలత వుంటుంది.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా

తలపెట్టిన పనులు అధికశ్రమతో పూర్తి చేస్తారు. దానికి తగ్గట్టు ఖర్చులు కూడా అధికంగానే వుంటాయి. సంతాన విషయమై ఆకస్మిక ప్రయాణాలు. వృత్తి, వ్యాపార, ఉద్యోగులు మార్పులు కోరకుండా కర్తవ్యాలకు అంకితమివ్వడం మంచిది. భాగస్వామ్య వ్యాపార లావాదేవీలు బాగున్నా భాగస్తులతో లౌక్యత ప్రదర్శించడం మంచిది. వృత్తి, వ్యాపారాలు ఆర్థికంగా పుంజుకుంటాయి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

శరీరారోగ్య విషయంలో పలు జాగ్రత్తలవసరం. ఆచార వ్యవహారాలలో నైరాశ్యం, ఇంటాబయట అధిక ఖర్చులు, ఎవరికి ఖర్చు చేస్తున్నామో అర్థంకాని పరిస్థితి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో అధికారుల ఒత్తిడి, తద్వారా మానసికాందోళన వుంటుంది. రాజకీయులకు పలు జాగ్రత్తలవసరం. కళా, క్రీడాకారులకు ఆర్థిక భద్రతలేర్పడగలవు. ధన, వస్తు, వాహనాలు ఇతరులకిచ్చుట మేలు కాదు.



**సింహం**
మఖ, పుబ్బ, ఉత్తర 1 పా

గ్రహాల మిశ్రమ ఫలితాలచే కొన్ని విషయాలలో అనుకూలతలున్నా మరికొన్ని విషయాలలో ప్రతికూలతలుంటాయి. వృత్తి, ఉద్యోగ తదితర రంగాలవారి ఆదాయాలు ఉత్సాహాన్నిస్తాయి. నూతన కార్యాల పట్ల ఆకర్షితులౌతారు. ప్రణాళికలు సిద్ధం చేస్తారు. ఉద్యోగులకు ప్రమోషన్లు లేదా విదేశీ అవకాశాలుంటాయి. మంచివారితో పరిచయాలు లాభిస్తాయి. భార్యాభర్తల మధ్య అవగాహన వుంటుంది.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

అన్ని అంశాలలో పలు జాగ్రత్తలవసరం. డాక్టర్లు లేదా రక్షకభటుల సహాయం అవసరమౌతుంది. యంత్రాలు, వాహనాల ఉపయోగాలలో జాగ్రత్త వహించండి. నూతన కార్యాలకు చేసే ఆలోచనలు ఫలిస్తాయి. కుటుంబ వ్యక్తులతో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థికంగా ఫర్వాలేదనిపిస్తుంది. కొన్ని పనులలో తేడాల వల్ల బంధుమిత్రులతో విరోధం కలుగుతుంది.

## పంచాంగం

30తేది ఇంద్ర ఏకాదశి.
2తేది గాంధీ జయంతి.
శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి జయంతి.
4తేది మహాలయ అమావాస్య.
బతుకమ్మ సంబరాలు ప్రారంభం.
5తేది శరన్నవరాత్రి ప్రారంభం.
తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాలు ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

భాద్రపదమాసం శూన్యమాసం కావున వివాహాది శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య విషయాలకు ముహూర్తాలున్నాయి.

### సెప్టెంబర్ తిథులు
భాద్రపద బహుళ

| | | | |
|---|---|---|---|
| 28 | శని | నవమి | రా 01.02 గం.ల.వ |
| 29 | ఆది | దశమి | రా 03.11 గం.ల.వ |
| 30 | సోమ | ఏకాదశి | తె 04.54గం.ల.వ |

### అక్టోబర్ తిథులు

| | | | |
|---|---|---|---|
| 1 | మంగళ | ద్వాదశి | పూర్తిగా |
| 2 | బుధ | ద్వాదశి | ఉ 06.03గం.ల.వ |
| 3 | గురు | త్రయోదశి | ఉ 06.37గం.ల.వ |
| 4 | శుక్ర | చతుర్దశి | ఉ 06.35గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్తా 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

మిశ్రమ ఫలితాలుంటాయి. ఆదాయం బాగుంటే మరొక సమస్య వుంటుంది. కొన్ని విషయాలలో ధైర్యంగా ముందుకు సాగుట మేలు. కొన్ని విషయాలలో కావలసిన వారే మోసం చేయుట తటస్థిస్తుంది. ఇంటాబయట వాదోపవాదాలు, అభివృద్ధి శూన్యం. ప్రయత్నాలు సాఫీగా సాగకపోవుట, కుటుంబ వ్యక్తుల ఆరోగ్య విషయం ఆందోళన కలిగిస్తుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జేష్ఠ

వారం ప్రారంభంలో అన్ని వర్గాల వారికి కొంతమేర రాణింపు వున్నా, ఉద్రేకాలకు లోనవుట, ఆదాయానికి మించిన ఖర్చులు, బంధువర్గం నుండి అప్రియమైన వార్తలు వినుట, రుణాలు, భూక్రయవిక్రయాలు చేస్తారు. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. వ్యవహారాలలో ఆచితూచి ప్రయత్నించిన జయం. ధనానికి ఇబ్బందులున్నా అవసరానికి సహాయం లభిస్తుంది.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

ప్రతికూలతలు తగ్గి చేపట్టిన పనులు సజావుగా సాగుతాయి. ఆందోళన అవసరం. వృత్తి, వ్యాపార, ఉద్యోగుల స్థితిలో వృద్ధి. చిన్నపాటి విందు, వినోదాలు చేసుకొంటారు. సంతాన విషయంలో శుభవార్తలు వింటారు. ఏ విధమైన ఇబ్బందులుండవు. ప్రభుత్వ సంబంధ పనులు సజావుగా సాగుతాయి. కళా, క్రీడాకారులకు అప్రయత్న ధన లాభాలు. వీరి పనులు చాలా సులువుగా పూర్తవుతాయి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

అన్ని రంగాల వారికి బాగుంటుంది. సప్తమ కుజుని వల్ల కొంత వ్యతిరేకత గోచరించుచున్నది. ప్రతి పని యందు, వాహన ప్రయాణాలు, శారీరక గాయాలు, బంధుమిత్రులకు హాని, కలహాలు, కొన్ని ఊహించని సంఘటనలు జరుగుతాయి. ఈతి బాధలు ఇబ్బంది కలిగిస్తాయి. మానసిక ధైర్యం పొందలేరు. కోర్టు వ్యవహారాలు వాయిదా వేయుట మంచిది. ఇంటాబయట అపవాదాలు ఎదుర్కొంటారు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

తలపెట్టిన పనులలో కొన్ని అవసర నిర్ణయాల వల్ల మంచి అవకాశాలు జారవిడుచుకొంటారు. కొన్నింటిలో విరమించుకొంటారు. భూసంబంధ క్రయవిక్రయాలు లాభాలు పొందగలవు. శరీరారోగ్యంలో మధ్యమ ఫలితాలుంటాయి. తల్లిదండ్రులను కలుసుకొంటారు. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. అన్ని రంగాల వారికి ఫర్వాలేదనిపిస్తుంది. రాజకీయులు కొత్త కార్యాలకు శ్రీకారం చుడతారు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఈ వారం కూడా గతవారం వలె వుంటుంది. ఏ పని లాభించదు. ప్రతి వ్యవహారం నిలిచిపోతుంది. చిరాకు కలిగించే పనులు లాభించవు. కుటుంబ సౌఖ్యం తక్కువ. అవమాన సంఘటనలు జరగవచ్చు జాగ్రత్తలవసరం. వ్యక్తిగత జాతకాలకు ప్రాధాన్యత ఇవ్వండి. సమస్యల పరిష్కారానికి ముందు గొయ్యి, వెనుక నుయ్యి లాగా వుంటుంది. కొన్ని ఇరకటాలు. ధన నష్టం జరగవచ్చు.

# ‘వర్గు’ నిర్ణయంలో చతుర్థ పంచమి, అష్టమాలు ‘అరిష్ట’ దాయకాలు!

*ఎస్.ఆంజనేయులు — నాయుడుపేట*

*★ గృహ నిర్మాణంలో ‘వర్గు’ గణన చేసేటప్పుడు ఏయే వర్గులను విసర్జించాలి?*

నాలుగు, ఐదు, ఎనిమిది వర్గులు రాకుండా చూసుకోవాలని ‘మయవాస్తు’ చెబుతోంది. చతుర్థ వ్యాధి, పంచమం శత్రుస్థానం, అష్టమం మరణ ప్రదమని శాస్త్రం చెబుతోంది.

*వై.పండిత వేణుశర్మ — బెంగుళూరు*

*★ ‘పిశాచ వేధో వినాశకరం’ అన్నది వశిష్ఠ సంహితలో చదివాను. దేన్ని ఉద్దేశించి ఈ శ్లోకం రాయబడింది?*

హనుమాన్ యంత్రం బలి, పూజ, నైవేద్య విధానాలను వివరిస్తూ పై శ్లోకం అందులో వున్నది. పరాశర సంహితలో సుదర్శన యంత్రమని కూడా వున్నది.

*వై.తిరుపతి — విజయవాడ*

*★ ‘మత్స్య యంత్రం’ ప్రతిష్ఠ తర్వాత చాలా బాధలు పడ్డాము.*

ఏ యంత్రాన్నీ గోడల లోపల, భూమి అంతర్భాగంలో ప్రతిష్ఠించకూడదు. దేవుడి గదిలో మండలం పూజా విధానంతో ప్రతిష్ఠించుకోవాలి.

*వి.వైష్ణవి — సూళ్లూరుపేట*

*★ జాతకం రాయించుకుంటే భయంకరమైన అంశాలు రాసి, పూజలు చేయించుకోవాలని శాసిస్తున్నారు?*

ఆ విషయంలో అనుమానం వున్నప్పుడు నిష్ణాతులైన శాస్త్రజ్ఞుడికి చూపించండి. భయపడవలసిన పనేమిటి? శాస్త్రజ్ఞులలో ఆషాఢ భూతులూ వున్నారు. మహాత్ములూ వున్నారు.

*జద్దెర్ల రామలింగం — పిడుగురాళ్ల*

*★ తమిళుల రాహుకాలాన్ని కదా మనం పాటిస్తున్నది. అది కరెక్టేనా?*

తమిళ రాహుకాలం చంద్రమాన పద్ధతిలో స్థిరీకరించారు. చంద్ర, సూర్యమానాల రాహుస్థితుల సమయాల్లో చాలా తేడా వుంది. ఈ తేడాల్ని శాస్త్రజ్ఞులు అంగీకరిస్తున్నారు కూడా!

*టి.ఉమాభారతి — సూళ్లూరుపేట*

*★ యంత్రాన్ని పూర్తిగా నమ్మవచ్చా?*

యంత్ర సారస్వతం ప్రపంచమంతా వున్నదే. మంత్ర సారస్వతం నుండి పుట్టిన మంత్ర బీజాక్షరాలు చాలా శక్తివంతమైనవి. వాటితో నిర్మించబడినది యంత్రం గనుక పూర్తిగా నమ్మవచ్చు.

*సి.పరంధామిరెడ్డి — పొదలకూరు*

*★ ఆస్తిపాస్తులు వుండి కూడా కుమారుడు అనారోగ్యవంతుడయ్యాడు. మృత్యువు తప్పదా?*

అతడిని తొమ్మిది రోజులు ‘నవగ్రహ’ప్రదక్షిణ, శని‘స్తోత్రం’ ఉపశమనానికి ‘నీలం’ రత్నధారణ, గృహ శాంతికి ‘సుదర్శనయంత్ర’ ప్రతిష్ఠ చేయించండి. భగవదనుగ్రహం పొందిన సత్యవంతుడు (సావిత్రి భర్త), మార్కండేయుడు మృత్యువు నుంచి తప్పించుకోలేదా?

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎం.అనుపమా శర్మ — తిరుపతి*

*★ శాంతిపూజల్లో ఏకాగ్రత అవసరం లేదా?*

ఏ కార్యంలోనైనా ఏకాగ్రత చాలా అవసరం. పూజల్లో కొందరు వ్యక్తులు నిర్లక్ష్యంగా వుంటారు. అది వారి తప్పే. వాళ్ల మీ ముందు ఇలా విలువల్ని కోల్పోతారు.

*డాక్టర్ జ్యోతిర్మయి — తిరుపతి*

*★ కూప దోషానికి, జల దోషానికి నివారణ చెప్పండి?*

కూప(బావి) దోషానికి అష్టవిధ పూజ, జలదోషానికి ‘ఓంకారాష్టక’, నారికేళ బలి నివారణ మార్గాలు. సంబంధిత యంత్రాలు కూడా ప్రతిష్ఠించుకోవచ్చు.

*కె.టి.రమ — ఒంగోలు*

*★ ‘నవ గ్రహ దోషం’ వల్ల పిల్లలు పుట్టరా?*

ఈ దోషాన్ని గురించి నేను కొత్తగా వింటున్నాను. ముందు మీరు మంచి గైనకాలజిస్టును సంప్రదించండి. ఆ పైన తొమ్మిది రోజులపాటు నవగ్రహ ప్రదక్షిణ చేయండి. దోష హరణం జరుగుతుంది.

*డాక్టర్ పర్వీన్‌బీ — హైదరాబాద్*

*★ భరద్వాజ మహర్షి వాస్తు గ్రంథం గాక మరేదైనా రాశారా?*

‘యాన ప్రహేళిక(విమానయానాన్ని గురించి విశ్లేషణ) భరద్వాజుడి ప్రశస్త్య గ్రంథం. అందులోని కొన్ని భాగాలను జర్మన్లు దొంగిలించారన్నది అపవాదు.

● అవినీతి, అక్రమాల బాటన

# కోవూరు షుగర్ ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరక్టర్!

**ఎంతో ఘన చరిత్ర ఉన్న కోవూరు షుగర్ ఫ్యాక్టరీకి మేనేజింగ్ డైరక్టర్‌గా పనిచేస్తున్న సుధాకర్‌రెడ్డి కోట్లాది రూపాయల నిధులు దుర్వినియోగం చేశాడన్న ఆరోపణలపై జిల్లా సహకారాధికారి ఫ్యాక్టరీ రికార్డులు స్వాధీనం చేసుకుని నిశిత పరిశీలన మొదలు పెట్టడం చర్చనీయాంశమయ్యింది.**

కోవూరు షుగర్ ఫ్యాక్టరీలో సహకార శాఖ అధికారులు ముమ్మర తనిఖీలు చేపట్టారు. ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరక్టర్‌గా వున్న సుధాకర్‌రెడ్డి కోట్ల రూపాయల నిధుల దుర్వినియోగానికి పాల్పడ్డారన్న ఆరోపణలు రావడంతో అధికారులు రికార్డులు తనిఖీలు జరిపారు. గత సీజన్‌లో ఫ్యాక్టరీకి చెరకు సరఫరా చేసిన రైతులకు దాదాపు 7 కోట్ల రూపాయలు బకాయిలు చెల్లించాల్సి వుంది. ఈ బకాయిల గురించి పలు దఫాలు ఫ్యాక్టరీ ఎమ్డీని, జిల్లా కలెక్టర్‌ను, మంత్రిని కలసి రైతులు విన్నవించుకోవడం జరిగింది. అదిగో ఇదిగో అంటూ కాలయాపన చేస్తూ వచ్చారే తప్ప బకాయిలు చెల్లించేందుకు ఏ ఒక్కరూ కృషి చేయలేక పోయారు. ఈ ఫ్యాక్టరీ పరిధిలో సంగం, బుచ్చి, కోవూరు, కొడవలూరు, ఇందుకూరుపేట మండలాలున్నాయి. ఈ మండలాల్లో ప్రతి సంవత్సరం చెరకును సరఫరా చేస్తుంటారు. నిర్ణీత సమయానికి చెరకు సరఫరా చేసిన రైతులకు మొత్తాలు చెల్లించాల్సి వున్నప్పటికీ నిధుల కొరత సాకుగా చూపి కాలయాపన చేస్తున్నాడు ఫ్యాక్టరీ ఎమ్డీ.

ఫ్యాక్టరీలో ఉత్పత్తి చేసిన చక్కెర విక్రయం ద్వారా నిధులు సమకూరినా కూడా రైతులకు బకాయిలు చెల్లించడం లేదన్నది రైతుల ఆరోపణ. రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో సహకార రంగం పరిధిలో నడుస్తున్న షుగర్ ఫ్యాక్టరీని సంబంధిత అధికారులు ఏనాడూ తనిఖీ చేసిన దాఖలాల్లేవు. సహకార శాఖ నుంచి ఫ్యాక్టరీ నిర్వహణ కోసం విడుదలైన నిధులు సైతం ప్రక్కదారి మళ్లాయన్న ఫిర్యాదుతో ప్రభుత్వం స్పందించక తప్ప లేదు. ప్రభుత్వ ఆదేశాల మేరకు జిల్లా సహకార శాఖ అధికారి, ఆడిట్ బృందం తనిఖీలు చేపట్టి కీలకమైన ఫైళ్లను స్వాధీనం చేసుకుని పరిశీలన చేస్తున్నారు. ఫ్యాక్టరీ పరిధిలోని రైతుల భాగస్వామ్యంతో పనిచేయాల్సి వున్నా ఎమ్డీ ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకోవడం కారణంగా అభివృద్ధి చెందక నష్టాల బాటలో నడుస్తుందని రైతు సంఘాల నేతలు వ్యాఖ్యానిస్తున్నారు. రైతులతో సర్వ సభ్య సమావేశం నిర్వహించి ఫ్యాక్టరీ నిర్వహణకు తీసుకోవాల్సిన చర్యలపై చర్చించడంలో విఫలం చెందుతున్నారు.

ఎంతో చరిత్ర కల్గిన ఈ ఫ్యాక్టరీ భవిష్యత్తుపై రైతులు ఆందోళన చెందుతున్నారు. ప్రస్తుత ఎమ్డీ ఏకపక్ష నిర్ణయాలు తీసుకుని నిధుల దుర్వినియోగానికి పాల్పడ్డాడన్న దానిపై ప్రభుత్వం సీరియస్‌గా పరిగణిస్తుంది. ఎమ్డీ సక్రమంగా విధులకు రావడం లేదని, అధికారులకు అందుబాటులో వుండడం లేదన్న ప్రచారం వుంది. గత కలెక్టర్ కూడా ఎమ్డీ పనితీరుపై తీవ్ర అసంతృప్తి వ్యక్తంచేసి రైతులకు న్యాయం చేస్తామని హామీ ఇచ్చారు. హామీ ఇచ్చిన తర్వాత ఆయన బదలీపై వెళ్లారు. ప్రస్తుత జిల్లా కలెక్టర్ శ్రీకాంత్ కొత్త కావడం వల్ల షుగర్ ఫ్యాక్టరీ స్థితిగతుల గురించి అధ్యయనం చేస్తున్నట్లు తెలిసింది. ఇటీవల కొందరు రైతులు




కోవూరు షుగర్ ఫ్యాక్టరీ.

కలెక్టర్‌ను కలిసి ఎమ్డీ అవలంభిస్తున్న విధానాలు, చెల్లించాల్సిన బకాయిల గురించి వినతిపత్రం అందజేశారు.

సహకార శాఖ అధికారులు ఫ్యాక్టరీలో తనిఖీలుచేసి రికార్డులు స్వాధీనం చేసుకోవడంతో కార్యాలయ ఉద్యోగుల్లో భయాందోళనలు నెలకొన్నాయి. ప్రధానంగా చక్కెర ఎగుమతులు, నిధుల దుర్వినియోగంపై దృష్టి సారించినట్లు తెలిసింది. అధికారుల పరిశీలనలో అక్రమాలు నిర్ధారణ జరిగితే శాఖాపరమైన చర్యలతోపాటు క్రిమినల్ కేసు కూడా నమోదుచేసే అవకాశం వుంటుందని అధికారులు చెబుతున్నారు.

తీగలాగిన ఎసిబి

## వైద్య ఆరోగ్య శాఖ కార్యాలయంలో

# అవినీతి మరోసారి బట్టబయలు!

**జిల్లా వైద్య ఆరోగ్య శాఖ కార్యాలయంలో అవినీతి మూడు పువ్వులు, ఆరు కాయల్లా విరాజిల్లుతుందని ఇక్కడ పనిచేసే సూపరింటెండెంట్ మీరావలిని ఎసిబి అధికారులు రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవడంతో లోకానికి వెల్లడయ్యింది. ఇక్కడ జరిగే అవినీతిని కొత్త డిఎంఅండ్‌హెచ్ఓ అంతం చేయాల్సి వుంది.**

జిల్లా వైద్య, ఆరోగ్య శాఖ కార్యాలయంలో అన్నీతానై చక్రం తిప్పే సూపరింటెండెంట్ మీరావలి పాపం పండింది. పదవీ విరమణ చేసిన డాక్టర్ మాశిలామణి హయాంలో ఏ పని కావాలన్నా మీరావలిని సంప్రదించాల్సిందే. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో విధులు నిర్వహించే వైద్యులు సైతం మీరావలి టేబుల్ దగ్గర గంటల తరబడి నిరీక్షించాల్సి వచ్చేది. పిహెచ్‌సిలకు నిధులు విడుదల కావాలన్నా, వైద్యులకు సంబంధించిన బిల్లులు మంజూరు చేయాలన్నా సూపరింటెండెంట్‌ను ప్రసన్నం చేసుకోవాలి. ఒక సమయంలో డిఎం అండ్ హెచ్ఓగా క్రిందిస్థాయి ఉద్యోగులపై పెత్తనం చేసేవాడు. ఇందుకు మాశిలామణి సైతం పరోక్షంగా సహకారం అందించేవారన్న ప్రచారం వుండేది.

మీరావలిని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవాలని ఎసిబి అధికారులు ఏడాది నుంచి నిఘా వుంచారు. చివరికి ఈ నెల 17వ తేది ఒక వైద్యుడి నుండి 9 వేల రూపాయలు లంచం తీసుకొంటుండగా పట్టుబడ్డాడు. జగదేవిపేట పిహెచ్‌సిలో పనిచేసే డాక్టర్ నిరంజన్‌కు అక్కడ సిబ్బందికి మధ్య విభేదాలు పొడచూపాయి. ఒకరిపై మరొకరు జిల్లా కలెక్టర్‌కు ఫిర్యాదులు చేసుకోవడంతో విచారణ జరిపారు. అదనపు జిల్లా జాయింట్ కలెక్టర్, ఎన్ఆర్‌హెచ్ఎం మేనేజర్ పెంచలయ్యలు విడివిడిగా సిబ్బందిని, డాక్టర్‌ను విచారించి నివేదికలు తయారుచేసి కలెక్టర్‌కు సమర్పించడం జరిగింది. పరిపాలన సౌలభ్యం కోసం వైద్యుడిని వేరే ప్రాంతానికి బదలీ చేశారు. దీనిపై ఎ.పి ట్రిబ్యునల్‌ను ఆశ్రయించి జగదేవిపేట పిహెచ్‌సిలోనే కొనసాగే విధంగా స్టే తెచ్చుకొన్నాడాయన.

స్టే ఉత్తర్వులకు అనుగుణంగా డిఎంఅండ్‌హెచ్ఓ మూవ్‌మెంట్ ఉత్తర్వులు ఇవ్వాల్సి వుంటుంది. ఈ ఉత్తర్వులు ఇచ్చేందుకు కార్యాలయ సూపరింటెండెంట్ మీరావలి వైద్యుడిని లంచం డిమాండ్ చేశాడట. లంచం ఇవ్వడం ఇష్టంలేని సదరు వైద్యుడు ఎసిబిని సంప్రదించి సమాచారం ఇవ్వడంతో పక్కా ప్రణాళిక రూపొందించి జడ్పీ కాలనీలో వున్న మీరావలి నివాసంలోనే పట్టుకున్నారు. ఇతన్ని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవాలని ఎదురు చూస్తున్న ఎసిబి అధికారుల లక్ష్యం ఎట్టకేలకు నెరవేరింది. ఇటీవల ఎఎన్ఎం పోస్టులకు సంబంధించి నోటిఫికేషన్ వెలువడడం, మెరిట్ జాబితా ప్రకటించిన సంగతి అందరికీ తెలిసిందే. పోస్టులు ఇప్పిస్తానని అభ్యర్థులకు ఫోన్‌చేసిన వారిలో ఇతనితోపాటు సిసి ప్రమేయం వున్నట్లు సమాచారం. దీనిపై పూర్తి సమాచారం, ఆధారాలు లేకపోవడంతో కలెక్టర్ ఏమీ చేయలేక పోయినట్లు తెలిసింది.

ఉద్యోగులకు బదలీలు, పదోన్నతులు కల్పించే విషయంలో కూడా పట్టుబడిన వ్యక్తి భారీస్థాయిలో ఆర్థిక లావాదేవీలకు పాల్పడ్డారన్న ఆరోపణలు లేకపోలేదు. అప్పటి డిఎం అండ్ హెచ్ఓ పేరు చెప్పి వైద్యులు, సిబ్బంది నుండి నగదు వసూళ్లు చేశాడన్న పేరుంది. ప్రస్తుతం డిఎం అండ్ హెచ్ఓ ఇతన్ని దూరంగా పెట్టినప్పటికి తన వ్యవహారశైలిని మాత్రం కొనసాగిస్తూనే వున్నాడు. ఎన్‌సిడి ప్రాజెక్టుకు సంబంధించి దాదాపు 30 లక్షల రూపాయలను జాతీయ బ్యాంకుల్లో లేకుండా ప్రైవేటు బ్యాంకులో డిపాజిట్ చేయడంలో ఇతని ప్రమేయం వున్నట్లు ఆ శాఖ ఉద్యోగులే వ్యాఖ్యానిస్తున్నారు. మీరావలితోపాటు ఇదే కార్యాలయంలో సీనియర్ అసిస్టెంట్, కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల విభాగంలో విధులు నిర్వహించే మరో మహిళపై అవినీతి ఆరోపణలు వున్నాయి.

ఈ ఇద్దరు ఉద్యోగులపై కూడా ఎసిబి నిఘా పెట్టింది. కుటుంబ నియంత్రణ విభాగంలో పర్యవేక్షించే ఉద్యోగిని ఎఎన్ఎంలు ఆపరేషన్లు చేయించినట్లు ధృవీకరణ చేసేందుకు ఒక ఆపరేషన్‌కు 200 నుండి 500 వరకు తీసుకుంటున్నట్లు తెలిసింది. గ్రామీణ ప్రాంతాల్లో మహిళలకు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించి ధృవీకరణ పత్రాన్ని ఈ కార్యాలయంలో వున్న విభాగంలో సమర్పిస్తుంటారు. వీటిని రికార్డుల్లో నమోదు చేసేందుకు ఎఎన్ఎంల నుండి నగదు వసూలు చేస్తుంటారని చెబుతున్నారు. జిల్లా వైద్య ఆరోగ్య శాఖ కార్యాలయం మారకుంటే మరోసారి ఎసిబి అధికారులు దాడులుచేసే అవకాశం వుంది. ఎసిబి అధికారులకు పట్టుబడిన మీరావలి ఆస్తులపై విచారణ కొనసాగుతుంది. ఇతని అరెస్టు గురించి తెలుసుకున్న అనేక మంది బాధితులు పాపం పండిందంటూ సంతోషం వ్యక్తం చేస్తుండడం విశేషం.

# ఓ మోస్తరుగా... వెల్‌కమ్ ఒబామా!



అల్లూరు రహీం

మాతృ ప్రేమకన్నా పెంచిన ప్రేమ గొప్పదంటారు. కానీ నవ మాసాలు గర్భాన మోసి జన్మనిచ్చే తల్లి ప్రేమ తక్కువని చెప్పడం కూడా పొరపాటే. నెల్లూరీయుడు 81 ఏళ్ల వయస్సులోనూ ఏమాత్రం ఉత్సాహం తగ్గని నవ యువకునిలా శ్రమిస్తున్న దర్శకుడు సింగీతం శ్రీనివాసరావు. దర్శక దిగ్గజం కెవిరెడ్డి దగ్గర సహాయకునిగా పనిచేసిన అనుభవశాలి. ఆయన మయూరి, పుష్పక విమానం, ఆదిత్య 369, విచిత్ర సోదరులు, భైరవ ద్వీపం వంటి ప్రయోగాత్మక చిత్రాలు తీశారు. ఇవన్నీ జనరంజక చిత్రాలుగా పేరుగాంచాయి. తాజాగా శాండల్‌వుడ్ మీడియా పతాకంపై భారతీ కృష్ణ నిర్మాతగా వెల్‌కమ్ ఒబామా వంటి చిత్రాన్ని సింగీతం శ్రీనివాసరావు నేతృత్వంలో తీశారు. ఈ సినిమాకు స్క్రీన్‌ప్లే, సంగీతం కూడా సింగీతం శ్రీనివాసరావునే కూర్చారు. భారతదేశంలో సరోగసి(అద్దె గర్భాలు) చౌకగా దొరుకుతున్నాయి. పలువురు విదేశస్తులు, స్వదేశస్తులు వీటిని ఉపయోగించుకొని తాము తల్లితండ్రులవుతున్నారు. రచయిత సమృద్ధిమూర్తి ఈ వాస్తవ ఘటనలకు కాస్త సెంటిమెంట్ కూర్చి కథ అల్లారు. సింగీతం శ్రీనివాసరావు అద్దె గర్భధారణ చేసిన మహిళలో బిడ్డ కడుపులో ఉన్నప్పుడు ప్రసవించిన తర్వాత చెప్పలేనంత ప్రేమాభిమానాలుంటాయని తనదైన ధోరణిలో స్క్రీన్‌ప్లే విస్తరించుకొంటూ పోయారు. కథకు తగ్గట్లు పాత్రల పోషణను ఎంచుకొన్న ఊర్మిళ, రేచల్, ఫ్రాన్స్‌కు చెందిన చిన్నారి బాలుడు ఎస్తబన్ చేత నటన రాబట్టుకోను గట్టి ప్రయత్నమే చేశారు. సంగీత హోరులో పాట వినపడకుండా పోయిన ఈ రోజుల్లో వెల్‌కమ్ ఒబామాలో పుట్టింది పాల కడలిలో, బుడి బుడి అడుగులతో, ఐయామ్ ఏ హీరో పల్లవులతో మొదలయ్యే పాటలకు కర్ణ ప్రేయమైన సంగీతమందించారు సింగీతం. విదేశస్తుడి వీర్య కణాలు భారతీయ స్త్రీ పిండంతో ఫలదీకరణ చేసిన తర్వాత పిండం రక్తమాంసాలతో రూపుదిద్దుకొనే అంశాన్ని సింపుల్‌గా ఒక సన్నివేశంలో దర్శకుడే చెప్పిన తీరు ప్రేక్షకుల మనసుకు హత్తుకొంటుంది. పాటల రచయితలు భువనచంద్ర, అనంత శ్రీరాం, రచయిత్రి బలభద్ర పాత్రుని రమణితో సింగీతం కామెడీ ట్రాక్ నడపడంలో మాత్రం విఫలమయ్యారు. నటి రోహిణి ఈ చిత్రానికి గొప్ప మాటలు వ్రాయలేక పోయారు. కొన్నిసార్లు ఆమె మాటలు తమిళ డబ్బింగ్ సినిమాను తలపిస్తాయి.




చిత్ర కథలోనికి వెళ్తే అమెరికాకు చెందిన లూసి(రేచల్) తనకో బిడ్డ కావాలంటూ అద్దె గర్భం ధరించను సిద్ధపడ్డ పోరుమామిడి గృహిణి యశోద(ఊర్మిళ) ఇంటికి వస్తుంది. వీరిద్దరికి ఇంటర్నెట్ ద్వారా బ్రోకర్ రామలింగం(విఎస్పీ ప్రసాద్) లింకు కుదురుస్తాడు. కేవలం లక్ష రూపాయల మొత్తానికి అద్దె గర్భం దాల్చను యశోద సిద్ధపడడానికి ఓ కారణముంటుంది. ఆమె కుమార్తె వికలాంగురాలు. ఈ డబ్బుతో ఆపరేషన్ చేయించాలని తలపోస్తుంది. యశోద భర్త బాధ్యతలను తప్పించుకొని పారిపోవడంతో మరో మార్గంలేక విదేశస్తుడి బిడ్డకు తన గర్భాన జన్మనివ్వను సిద్ధపడుతుంది ఈ ఇల్లాలు. ప్రసవానికి ముందు వైద్య పరీక్షలకు వెళ్లిన యశోద కడుపులోని బిడ్డ వికలాంగుడుగా ఉన్నాడని డాక్టర్లు పొరపాటున చెబుతారు. ఇది విని లూసీ అమెరికా వెళ్లిపోతుంది. యశోద పండింటి బిడ్డను ప్రసవించి అతనికి కృష్ణుడు(ఎస్తబన్) అని పేరుపెడుతుంది. ఈ కృష్ణుడిని యశోద తమ్ముడు గణపతి(సంజీవ్) ఒబామాగా పిలుస్తుంటాడు. కృష్ణుడు పెరిగి పెద్దయిన విషయం తెలుసుకున్న లూసీ మళ్లీ పోరుమామిడి వస్తుంది. డబ్బు దస్కం వినియోగించి పోలీస్ కేసు పెడుతుంది. న్యూసెన్స్ అంతా ఎందుకు కృష్ణుడు లూసీ దగ్గరే బాగా బతుకుతాడని ఆమెతో పంపేస్తుంది యశోద. కానీ కృష్ణుడు యశోద పెంపకానికి, ఆమె మరులకు దాసుడవుతాడు. తనను లూసీ యశోద వద్దకు తిరిగి చేర్చేంత వరకు మౌనవ్రతం దాల్చి విజయం సాధించడంతో చిత్రం ముగుస్తుంది. సింగీతం గత చిత్రాల స్థాయిలో కాక ఓ మోస్తరుగా ఉన్నాడు వెల్‌కమ్ ఒబామా.

## ప్రేమలో పల్లవీ శ్రద్ధ!



బాలీవుడ్‌లో ఈ మధ్య పలువురు కొత్త హీరోయిన్లు వస్తున్నారు. వీరిలో ఎక్కువ మంది మోడలింగ్ రంగం నుంచే వస్తున్నారు. రణ్‌బీర్‌కపూర్‌తో బేషరమ్ చిత్రంలో నటించిన హీరోయిన్ పల్లవీ శ్రద్ధ. ఈ అమ్మడు మీడియా కమ్యూనికేషన్‌లో డిగ్రీ చదివింది. ఆ తర్వాత మిస్ ఇండియా ఆస్ట్రేలియా 2010 కిరీటాన్ని గెలుచుకుంది. ఇప్పుడు బాలీవుడ్ నటుడు ఆయుష్మాన్ ఖురానాతో ప్రేమలో పడిందనీ, ఇద్దరి మధ్య డేటింగ్ నడుస్తోందని అంటున్నారు. బేషరమ్‌లో ఆయుష్మాన్ ఖురానా కూడా నటించాడు. అప్పుడే ఇద్దరి మధ్య ప్రేమ చిగురించిందనీ అంటున్నారు. పల్లవి కరణ్ జోహార్ తీసిన మై నేమ్ ఈజ్ ఖాన్‌లో తళుక్కున మెరిసింది. త్వరలోనే ఆయుష్మాన్ బ్రిటీష్ యువకుడిగా, పల్లవి మహారాష్ట్రకు చెందిన యువతిగా ఓ చిత్రం తెరకెక్కబోతోంది. ఇది ఒక కల్పిత కథగా చెప్తున్నారు.

## ఫైటింగ్ చేసిన కాజల్



ఇటీవల కాలంలో హీరోయిన్లు ఆడిపాడటానికే పరిమితమవుతున్నారు. ఫైట్లుచేసే బాధ్యతను మాత్రం హీరోలే తీసుకొంటున్నారు. అయితే హీరోయిన్ కాజల్ మాత్రం లాఠీ చేతబట్టి పోరాటాలు చేస్తోంది. హీరోకు ధీటుగా రౌడీల పనిపడుతుంది. ఈ సందడంతా తమిళంలో తెరకెక్కుతున్న 'బిల్లా'లోనిదే. విజయ్ హీరోగా నటిస్తున్న ఈ చిత్రంలో కాజల్ కూడా పోలీస్ ఆఫీసర్‌గా కనపడుతుంది. హీరోయిన్ అయినా కొన్ని ఫైట్లు చేస్తుంది. దీనికోసం శిక్షణ కూడా తీసుకొంది. విజయ్ సినిమాల్లో కాజల్‌కు కీలకమైన పాత్రలే దక్కుతున్నాయి. ఇదివరకు ప్రేక్షకుల ముందుకొచ్చి 'తుపాకీ'లో కాజల్ బాక్సర్‌గా నటించింది. ఈ చిత్రం చక్కటి విజయాన్ని సొంతం చేసుకొంది. మరోసారి జతకట్టిన ఈ ఇద్దరూ తెరపై ఎలా సందడి చేస్తారో చూడాలి.

## లడ్డూబాబులో భూమిక

అరనవ్వుతో కుర్రాళ్ల మతిపోగొట్టిన అందం హీరోయిన్ భూమికది. పలువురు తెలుగు హీరోల సరసన ఆమె ఆడిపాడింది. యోగా గురు భరత్ ఠాకూర్‌తో వివాహమయ్యాక తెరకు దూరమయ్యింది. తిరిగి ఆమె నటించడానికి సిద్ధమైనా సరైన అవకాశాలు రాలేదు. ఇప్పుడు మాత్రం మళ్లీ తెరపై మెరిసేందుకు సిద్ధమైంది. అల్లరి నరేష్ హీరోగా నటిస్తున్న చిత్రంలో ఆమె నటించబోతుంది. లడ్డూబాబు పేరుతో తయారవుతున్న ఈ చిత్రానికి రవిబాబు దర్శకుడు. ఈ చిత్రంతో మళ్లీ ఫామ్‌లోకి రావాలని భూమిక భావిస్తుంది. గతంలో రవిబాబు దర్శకత్వంలో భూమిక అనసూయ చిత్రంలో నటించింది.



## నక్కతోక తొక్కిన ఫ్రిదా!



అందాలకు మెరుగులు దిద్దే సౌందర్య ఉత్పత్తులకు ప్రపంచంలోనే మంచి గిరాకీ ఉంది. వాటిని సామాన్యుల దగ్గరకు చేర్చడంలో సినీ తారలు కీలక పాత్ర పోషిస్తుంటారు. అందుకే భారీస్థాయి పారితోషికాలు ఇచ్చి వాళ్లతో ప్రచారం చేయించుకొంటుంటాయి ఉత్పత్తి సంస్థలు. తారలను తమ బ్రాండ్ అంబాసిడర్లుగా నియమించుకొంటుంటాయి. ఇదివరకు ఐశ్వర్య రాయ్, సోనమ్‌కపూర్‌లను తమ బ్రాండ్ అంబాసిడర్లుగా నియమించుకొన్న ప్రఖ్యాత కాస్మొటిక్ సంస్థ ఇప్పుడు ఆ అవకాశం ఫ్రిదాపింటోకి ఇచ్చింది. దశాబ్దాలుగా సినీ రంగంలో ఉన్న ఐశ్వర్య, సోనమ్‌లను కాదని ఫ్రిదా పింటోకి ఈ అవకాశం రావడానికి ఆమె 'స్లమ్ డాగ్ మిలీయనీర్'లో అంతర్జాతీయంగా పేరు సంపాదించుకోవడమే కారణమంటున్నారు.

## శృతిహాసన్ లడాయి

గబ్బర్‌సింగ్ చిత్రం హీరోయిన్ శృతిహాసన్‌కు స్టార్ ఇమేజ్ తెచ్చిపెట్టింది. ఏకంగా మహేష్‌బాబు సరసన నటించే ఛాన్స్ కూడా తెచ్చిపెట్టింది. ఆగడు సినిమాలో మెయిన్ హీరోయిన్‌గా శృతిని, రెండవ హీరోయిన్‌గా సమంతను దర్శకుడు శ్రీనువైట్ల ఫిక్స్ చేశాడు. కానీ సమంత డేట్స్ లేకపోవడంతో తమన్నాను ఎంపిక చేశాడు. అంతే ఈ చిత్రంలో తాను నటించనని శృతిహాసన్ తేల్చి చెప్పేసిందట. బాలీవుడ్‌లో అవకాశాల కోసం శృతికి తమన్నాకు మధ్య కోల్డ్‌వార్ జరుగుతుందట. దీనికోసం ఆమె మహేష్‌బాబు సరసన నటించే ఛాన్స్ పోగొట్టుకోవడం తప్పంటున్నారు సినీ విమర్శకులు.



# నెల్లూరు వైద్యుల దోపిడీ!

### భయపడిపోతున్న రోగులు

వైద్యం పేరుతో వైద్యులు చేస్తున్న దోపిడీ రోజురోజుకు అధికమవుతుండడంతో డాక్టర్లను దైవంగా భావించి వచ్చే రోగులు వీరి నిర్వాకం చూసి ఛీత్కరించుకొంటున్నారు. ఆస్పత్రికి వచ్చిన నాటి నుంచి ఎన్ని విధాల వీలైతే అన్నిరకాలుగా రోగులను దోచుకొనేందుకు అధిక సంఖ్యాకులైన వైద్యులు ప్రయత్నిస్తుండడంపై విమర్శలు వ్యక్తమవుతున్నాయి. వైద్యుడి వద్దకు ఏదైనా అనారోగ్య సమస్యతో రోగి వచ్చినప్పటి నుంచే పలువురు వైద్యులు తమ ప్రతాపం చూపిస్తూ నిలువునా దోచుకొంటున్నారు. అవసరం వున్నా లేకపోయినా అన్ని రకాల టెస్టులు, ఎక్సరేలు, ఇసిజి, స్కానింగ్‌లకు వ్రాసే వారి సంఖ్య అధికం. జలుబుతో పోయినా, జ్వరమని పోయినా అంతే సంగతులు. ల్యాబ్ ఖర్చు వేలల్లో వుంటుంది. ఇక ఆ తర్వాత డాక్టర్లు వ్రాసే మందుల చీటీలు చాంతాడంత వుంటున్నాయి. ఈ మందు వేసుకుని కడుపులో మంట వస్తే మరొక మందని ఇలా ప్రిస్కిప్షన్‌లు నింపేస్తున్నారు. ఈ మందుల్లో చాలా మటుకు చాలా మంది డాక్టర్లు వ్రాసే మందులు నాణ్యతారహితంగా వుంటున్నాయనే ఆరోపణలున్నాయి. పలు ఆస్పత్రుల్లో డాక్టర్లే స్వయంగా మందుల షాపులు నిర్వహిస్తున్నారు. చాలా మందుల కంపెనీలు అమ్మకాలకు సంబంధించి డాక్టర్లకు విదేశీ టూర్లు, ఆకర్షణీయమైన బహుమతులతో ఎరవేస్తుండడంతో కంపెనీల టార్గెట్‌ను లక్ష్యం చేసుకుని ఇబ్బడిముబ్బడిగా చెత్త మందులు, ఏమాత్రం పనిచేయని ఊరు, పేరులేని మందులను రాసేస్తూ విదేశాలలో విహార యాత్రలు చేసే డాక్టర్ల సంఖ్య ఎక్కువగా వుంటోంది. ఇక పలువురు డాక్టర్లు ల్యాబ్ నిర్వాహకులతో కుమ్మక్కై కొన్ని పరీక్షలు అవసరం లేకపోయినా వ్రాస్తున్నారు. కానీ వాటిలో కొన్నింటిని పరీక్షించాల్సిన అవసరం లేదని ల్యాబ్ నిర్వాహకులకు మాత్రమే తెలిసిన కోడ్ గుర్తులు పెడుతూ రోగులను దగా చేస్తున్నారు. ఎక్స్‌రే, డయాగ్నొస్టిక్ సెంటర్ల నిర్వాహకులు నెల నెలా ఇచ్చే పర్సెంటేజీలపై కక్కుర్తితో, మందుల కంపెనీలు ఇచ్చే ఆఫర్లతో కొందరు వైద్యులు చేస్తున్న దోపిడీ పవిత్రమైన వైద్య వృత్తికే కళంకం తెస్తోంది.

## శిశువుల పేర్లు తప్పక నమోదు చేయాలి!

నెల్లూరు నగరంలో జన్మించిన శిశువుల పేర్లను మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయంలో నమోదు చేసుకోవాలని అధికారులు కోరుతున్నారు. ఆసుపత్రిలోగానీ, ఇంటివద్దగానీ జన్మించిన శిశువుల వివరాలను, కార్పొరేషన్ కార్యాలయంలో నమోదు చేస్తారు. జనన ధృవీకరణ పత్రం పొందే నాటికి తప్పనిసరిగా శిశువులకు పేరు పెట్టి రికార్డుల్లో నమోదు చేయించాల్సి వుంటుంది. పేరు పెట్టకుండా ధృవీకరణ పత్రం పొందితే భవిష్యత్తులో అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఒకసారి ధృవీకరణ పత్రం పేరు లేకుండా జారీచేస్తే తిరిగి పేరు పెట్టిన తర్వాత జారీచేసే అవకాశం గతంలో వుండేది. ఇటీవల సుప్రీంకోర్టు జారీచేసిన మార్గదర్శకాల ప్రకారం శిశువు జన్మించిన 15 సంవత్సరాలుగా పేర్లు నమోదు చేసుకోవాలని తెలిపారు. జనన ధృవీకరణ పత్రాలను మీ – సేవ ద్వారా జారీచేసే విధానానికి శ్రీకారం చుట్టడంతో కార్యాలయంలో పేర్లు నమోదు చేసిన తర్వాతనే ధృవీకరణ పత్రాలు తీసుకోవాలని చెబుతున్నారు. నెల్లూరులో పుట్టిన పలువురు విదేశాల్లో, ఇతర రాష్ట్రాల్లో స్థిరపడ్డారు. వీరి తరపున బంధువులు, తల్లితండ్రులుగానీ పేర్లతో కూడిన అఫిడవిట్‌న సమర్పించ వచ్చంటున్నారు కార్పొరేషన్ ఆరోగ్యాధికారి సుబ్బరాజు.

**కార్పొరేషన్ ఆరోగ్యాధికారి**

## వ్యాపారులకు సమైక్య సెగ!

**కొనుగోళ్లు లేవు – అమ్మకాలు లేవు!**



నగరంలో విపణివీధి స్టోన్‌హౌస్‌పేటలో సందడేది?

సమైక్యాంధ్ర ఉద్యమ ప్రభావంతో వ్యాపార లావాదేవీలు నిలచిపోయాయి. యాభై రోజులకు పైగా జరుగుతున్న ఉద్యమంతో రవాణా నిలిచిపోయి రాకపోకలు స్తంభించి పోయాయి. జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి నగరానికి వచ్చి అవసరమైన వస్తువులు, చిల్లర సామాన్లు, మందులు, గుడ్డలు, ఇతరత్రా వస్తువులు కొనుగోలు చేసి తీసుకుపోతుండేవారు. మారు బేరానికి అమ్ముకొనే వ్యాపారస్తుల నుంచి సామాన్య ప్రజల వరకు అధిక సంఖ్యలో నగరానికి వస్తుండడంతో వ్యాపారం జరుగుతుండేది. కానీ సమైక్యాంధ్ర సమ్మె కారణంతో ఆర్టీసి బస్సులు నడవకపోవడంతో గ్రామాల నుంచి పట్టణాలకు, నగరానికి రాకపోకలు నిలిచి పోయాయి. దీంతో బయట ప్రాంతాల నుంచి కొనుగోలు చేసేందుకు వచ్చే వారి సంఖ్య నామమాత్రమైంది. ఈ ప్రభావం చిల్లర అంగళ్లు, వస్త్ర రంగం, మందుల అంగళ్లపై తీవ్రంగా పడుతోంది. దీనికితోడు నెల రోజులకు పైగా ఉద్యోగులు సమ్మె చేస్తుండడం, ప్రభుత్వం నో వర్క్, నో పే అని చెప్పడంతో జీతాలు రాక ప్రభుత్వ ఉద్యోగులు అల్లాడి పోతున్నారు. సాధారణంగా ప్రతి నెల మొదటి వారంలో ఉద్యోగులు సూపర్ మార్కెట్‌లు, ప్రొవిజన్ షాపులకు వచ్చి నెలసరి సరుకులు కొనుగోలు చేస్తుంటారు. ఆ సమయంలో వ్యాపారం బాగుంటుంది. అలాంటిది ఉద్యోగులకు జీతాలు రాకపోవడంతో సామాన్లు కొనుగోలు చేసేందుకు ఎవరూ రాకపోతుండడంతో నగరంలో పేరొందిన సూపర్ మార్కెట్‌లు, స్టోన్ హౌస్‌పేటలో చిల్లర సామాను అమ్మే షాపులు కొనుగోలు దారులులేక వెలవెల పోతున్నాయి. గ్రామాల నుంచి వివిధ వైద్య చికిత్సలకు వచ్చే వారి సంఖ్య తగ్గిపోవడంతో ఆస్పత్రులు ఖాళీగా వుంటున్నాయి. సినిమా హాళ్లు ఖాళీగానే కన్పిస్తున్నాయి. మొత్తంమీద సమైక్యాంధ్ర ఉద్యమ ప్రభావం జిల్లాపై వివిధ రూపాల్లో పడింది.

## వివేకా సమైక్యాంధ్ర కార్యక్రమాలు ఫ్లాప్!

### సహస్ర వాహన గర్జన వరకు పరవాలేదు

ఎన్జీఓల ఆధ్వర్యంలో నగరంలో జరుగుతున్న సమైక్యాంధ్ర కార్యక్రమాలకు భిన్నంగా తమదైనశైలిలో నిర్వహించేందుకు, తన సత్తా చాటేందుకు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి, నగర శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి కలసి కార్యక్రమాలకు రూపకల్పన చేశారు. ప్రైవేట్ విద్యా సంస్థల జెఏసిని ఏర్పాటుచేసి కమిటీలు వేశారు. విఆర్‌సి కూడలిలో పెద్ద వేదికను ఏర్పాటు చేశారు. ఇంతవరకు బాగానే వున్నా జలదీక్ష పేరుతో నెల్లూరు చెరువు వద్ద నిర్వహించిన కార్యక్రమానికి జన స్పందన కరువయ్యింది. అలాగే మసీదుల్లో ముస్లింలతో కలసి సమైక్యాంధ్ర కోసం ప్రార్థనలని ప్రకటించినా ఎందువల్లనో వివేకానందరెడ్డి ఒకటి రెండు మసీదులకుపోయి కార్యక్రమం అయిందనిపించారు. అనారోగ్యం కారణంగా మునుపటిలా వివేకానందరెడ్డి చురుకుగా కదలలేకపోవడం కన్పిస్తోంది. ఇక నగరంలో సహస్ర వాహనాల గర్జన పేరుతో జరిపిన కార్యక్రమం మాత్రం బాగా జరిగింది. ద్విచక్ర వాహనాలు, టిప్పర్లు, జెసి



బిలు, టౌన్ బస్సులు, లారీలు, స్కూలు బస్సులతో దర్గా నుంచి పొదలకూరు రోడ్డు మీదుగా అయ్యప్ప గుడి వరకు వెళ్లి అక్కడ నుంచి నగరంలోకి వచ్చి గాంధీబొమ్మ మీదుగా ఆత్మకూరు బస్టాండు వరకు జరిగిన ఈ ర్యాలీ ప్రజలను ఆకట్టుకొంది. ఈ ర్యాలీ నిర్వహణలో మాత్రం ఆనం వివేకానందరెడ్డి మార్కు కన్పించింది. దీనితోపాటు నగరంలో పలువురు వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తుండడంతో నగరం సమైక్యాంధ్ర కార్యక్రమాలు, నినాదాలతో మారుమ్రోగి పోతోంది.

## ప్రశాంతంగా నర్సుల ఎంపిక!

- కలెక్టర్ జోక్యంతో పరిస్థితి అదుపులోనికి వచ్చింది

జిల్లా వైద్య, ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో నిర్వహించిన నర్సుల పోస్టుల ఎంపిక ప్రశాంతంగా ముగిసింది. నర్సుల ఖాళీల భర్తీకి సంబంధించి నోటిఫికేషన్ వెలువడిన నాటి నుంచి అనేక అనుమానాలు, సందేహాలు వ్యక్తం చేశారు అభ్యర్థులు. 31 పోస్టులకుగాను 561 దరఖాస్తులు స్వీకరించడం జరిగింది. ఈ శాఖ కార్యాలయంలో అధికారికి సన్నిహితంగా వుండే వ్యక్తి కొందరు అభ్యర్థులకు ఫోన్‌చేసి లక్ష రూపాయలు ఇస్తే నర్సు పోస్టు ఇప్పిస్తానని చెప్పినట్లు సమాచారం. ఈ విషయం బయటకు పొక్కడంతో జిల్లా కలెక్టర్ స్పందించి దరఖాస్తు చేసిన వారి జాబితాను, మెరిట్ అభ్యర్థుల జాబితాలను నోటీస్ బోర్డులో వుంచాలని ఆదేశించడం జరిగింది. కలెక్టర్ ఆదేశాలకు అనుగుణంగా మెరిట్ జాబితాను ప్రకటించి ఏదైనా అభ్యంతరాలుంటే వారం రోజుల్లోగా తెలియజేయాలని కోరారు. మెరిట్, రిజర్వేషన్ల ఆధారంగా అభ్యర్థులను ఎంపిక చేయడంతో పైరవీదారుల ఆటలు సాగలేదు. డిఎం అండ్ హెచ్‌ఓ, వైద్య విధాన పరిషత్ కో–ఆర్డినేటర్, జాయింట్ కలెక్టర్ల సమక్షంలో మెరిట్ అభ్యర్థులకు ఇంటర్వ్యూలు నిర్వహించి 29 మందికి నియామక ఉత్తర్వులు అందించారు. ఎంపిక కాబడిన వారు స్థానికంగా నివాసం వుండే ప్రాంతాల్లోనే నియమించారు. ఒక ప్రాంతంలో నివాసం వుంటూ మరో ప్రాంతంలో ఉద్యోగం చేయడం కష్టమని ముందుగానే అధికారులు హెచ్చరించారు. స్థానికంగా వుంటూ ప్రాంతాన్ని కోరుకోలేని వారు కౌన్సిలింగ్ నుండి తప్పుకోవడం మంచిదని సూచించారు. దీంతో స్థానికంగా నివాసం వుండే ప్రాంతాన్నే అభ్యర్థులు ఎంపిక చేసుకోవడంతో ఈ ప్రక్రియ ముగిసింది.

## ఇరిగేషన్ స్థలం ఆక్రమించి నిర్మాణం!

### మాజీ కార్పొరేటర్ అండదండలు

నగరంలోని ఫత్తేఖాన్‌పేట వద్ద కాలువను కొంత ఆక్రమించి నిర్మాణం చేపడుతున్నారు. కెవిఆర్ పెట్రోల్ బంకు వైపు నగరంలోకి వచ్చే రహదారికి పడమర వైపున డ్రైనేజి కాల్వ వుంది. ఒకప్పుడు ఈ కాలువ నీటి పారుదల శాఖకు సంబంధించినది. ఈ కాలువ ద్వారా నెల్లూరు చెరువు నుండి తూర్పు వైపునున్న పొలాలకు సాగునీరు సరఫరా జరిగేది. రాను రాను ఈ కాలువ ఇరువైపుల ఆక్రమణకు గురైంది. ఈ విషయం సంబంధిత శాఖ అధికారులకు తెలిసినా రాజకీయ జోక్యంతో ఆక్రమణ దారులపై చర్యలు తీసుకునేందుకు ముందుకు రాలేక పోయారు. ప్రస్తుతం ఓ మాజీ కార్పొరేటర్ సహకారంతో కాల్వను కొంత పూడ్చి భవన నిర్మాణం చేపట్టారు. ఈ దారిన వెళ్లే ప్రతి ఒక్కరితోపాటు అధికారులు సైతం దీనిని చూస్తున్నా పెద్దగా స్పందించడం లేదు. రోడ్డు ప్రక్కన మాత్రం నిబంధనల ప్రకా



యధేచ్ఛగా అక్రమ నిర్మాణం.

రం భవన నిర్మాణం చేస్తున్నట్లు కనిపిస్తుంటుంది. దీని వైనుక వైపునకు గానీ, రైతు బజారువైపుకు వెళ్లి చూస్తే కాలువను ఏ మేరకు ఆక్రమణ చేశారన్నది స్పష్టంగా కనిపిస్తుంది. ఈ ఆక్రమణలపై మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు ఎలా స్పందిస్తారో వేచిచూడాలి.

## మోడీ, బాబు భాయి భాయి!

మొదటి పేజీ కొరవ

### ఎన్నో రాజకీయాలు

ఇటు ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఎన్నో మార్పులు. కాంగ్రెస్ పార్టీ తెలంగాణ ఇస్తున్నట్లు ప్రకటన చేసింది. అది టిఆర్ఎస్ పార్టీని, కెసిఆర్‌ను బాగా ఇరకాటంలోకి నెట్టింది. మామూలుగా అయితే ఈసారి తెలంగాణ ప్రాంతంలో టిఆర్ఎస్, బిజెపి కలిసి పోటీ చేస్తాయని భావించారు అందరూ. కానీ ఇప్పుడు అది వీలు కాదు. తెలంగాణ ఇస్తున్నట్లు ప్రకటన చేసిన తర్వాత ఆ ప్రాంతంలో కాంగ్రెస్ పట్ల ప్రజలలో సానుభూతి అధికమైంది. కరెంట్, అధిక ధరల వంటి నిత్య జీవన సమస్యలను పక్కనపెట్టి భావోద్వేగాలతో తెలంగాణ ప్రాంత ప్రజలు కాంగ్రెస్ పట్ల మొగ్గు చూపుతున్నారు. అందువల్ల సహజంగా కెసిఆర్ కూడా అటే ప్రయాణం చేయాలి. తప్పదు. ఇటు ఆంధ్ర ప్రాంతంలో జగన్‌కు బెయిల్ లభించింది. నీరసపడి వుండిన ఆ పార్టీకి అదొక జీవన్‌టోన్ టానిక్‌తో సమానం. ఇది చాలదన్నట్లు సమైక్యాంధ్ర ఉద్యమం ఉధృతంగా కొనసాగుతున్నది. తెలుగుదేశం పార్టీ తెలంగాణ ఏర్పాటుకు లేఖ ఇచ్చే రోజు ఆంధ్రాలో ఇంత బలీయమైన భావనలు వున్నాయన్న పోబిడి కూడా లేదు. ఇప్పుడు తెలంగాణ మీద వెనక్కుపోతే పార్టీ పరువు పోతుంది. ఉభయ భ్రష్టుత్వం తప్పదు.

ఈ నేపథ్యంలో చంద్రబాబుకు కూడా ఒక అండ కావాలి. అటు తెలంగాణలో టిఆర్ఎస్‌ను, ఇటు ఆంధ్రలో జగన్‌ను ఢీకొనాలంటే తనొక్కడి బలం చాలదు. దానితో విధిలేక, మరొకదారి కన్పించక, బిజెపితో పొత్తుకు సిద్ధమైనట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. బిజెపితో కాపురం ఆయనకు కొత్తేమీ కాదు. 1998, 99ల నాటి వాజ్‌పాయి ప్రభుత్వాలకు చంద్రబాబు సహకారం వుంది. ఆ ఆరేళ్ల పాటు కలిసి పని చేశారు.

### బిజెపికి బాబు అవసరం

అదే సమయంలో బిజెపికి కూడా చంద్రబాబు అవసరం చాలానే వుంది. అద్వానీ పెద్దరికాన్ని నిర్ధాక్షిణ్యంగా, నిర్లక్ష్యం చేసి మరీ నరేంద్రమోడీని రంగం మీదకు తెచ్చింది పార్టీ. ఆ నిర్ణయం సరైనదని నిరూపణ కావాలంటే 2014 ఎన్నికలలో అధికారం దక్కించుకోవాలి. అయితే బిజెపికి ఒంటరిగా అది సాధ్యం కాదు. దాని ప్రభుత్వాలున్న మధ్యప్రదేశ్, చత్తీస్‌ఘడ్ వంటి రాష్ట్రాలలో ఈసారి బోర్డు తిరగబడవచ్చుననే సంకేతాలొస్తున్నాయి. గత ఎన్నికలలో బీహార్, ఒరిస్సాలలో మెజార్టీ స్థానాలు సంపాదించిపెట్టిన నితీష్‌కుమార్, నవీన్ పట్నాయక్ ఇప్పుడు దూరమై పోయారు. మహారాష్ట్రలో బాల్ థాకరే మరణించాడు. ఆయన వారసత్వం కోసం తన్నుకొని చస్తున్న రాజ్, ఉద్దవ్ థాకరేలు అక్కడ బిజెపి అవకాశాలను క్షీణింప చేస్తున్నారు. ఈ నేపథ్యంలో నరేంద్రమోడీ ప్రభంజనాన్ని ఓట్ల రూపంలో మలచుకోవాలంటే ప్రాంతీయ పార్టీల సహకారం ఒక్కటే మార్గం. అందుకోసం వారు చంద్రబాబు నాయుడు, మమతా బెనర్జీ, జయలలిత, ఓంప్రకాష్ చౌతాలా, అజిత్‌సింగ్, యడ్యూరప్ప వంటి ప్రాంతీయ పార్టీ నేతలందరినీ దువ్వుతున్నారు.

అయితే మన రాష్ట్రంలో కిషన్‌రెడ్డి వంటి బిజెపి స్థానిక నేతలకు చంద్రబాబుతో పొత్తు ఇష్టం లేదు. ఈసారి తాము స్వంతంగా లేదా టిఆర్ఎస్‌తో కలిసి పోటీ చేస్తే గణనీయమైన స్థానాలు గెల్చుకోవచ్చునన్నది కిషన్‌రెడ్డి ఆలోచన. కానీ ఢిల్లీ స్థాయిలో ఆలోచన చేసే నరేంద్రమోడీ, స్థానిక నేతలను పట్టించుకొనే ధోరణిలో లేడు. ఇప్పటికే ఒకసారి కిషన్‌రెడ్డికి నరేంద్రమోడీ నుంచి మందలింపు వచ్చింది.

### సర్వేతో మారిన చంద్రబాబు మనసు!

నరేంద్రమోడీ ప్రధాని అభ్యర్థిగా ప్రకటింపబడిన తర్వాత రాష్ట్రంలో ప్రజాభిప్రాయం ఎట్లా వుందో తెలుసుకోవడానికి చంద్రబాబు నాయుడు ఒక సర్వే జరిపించారట. అందులో మోడీ ప్రభావం అనుకొన్నదానికంటే అధికంగా వుందని తేలిందట. ఆంధ్ర ప్రాంతంలో కూడా పెద్ద సంఖ్యలో మహిళలు, యువతరం ఓట్లు ఈసారి ఎన్నికలలో ఎమ్పీ స్థానానికి బిజెపికి, ఎమ్మెల్యే స్థానానికి జగన్‌కు ఓటు వేయాలనే అభిప్రాయం వ్యక్తం చేసినట్లు తేలింది ఆ సర్వేలో. దాన్ని చూసిన తర్వాత ఇక ఏ మాత్రం రిస్క్ తీసుకోవడానికి సిద్ధంగా లేడు చంద్రబాబు. మైనార్టీ ఓట్లు రాకపోయినా ఫర్వాలేదు, మోడీతో కలిసి ప్రయాణం చేయాలనే నిర్ణయానికి వచ్చేశాడని ఆంతరంగికులు చెప్తున్నారు.

## సమైక్యాంధ్ర ఉద్యమం

16వ పేజీ కొరవ

ఆ ఒక్క కారణం వల్ల మొత్తం ఉద్యమమే స్వార్ధపరుల పెత్తనంలో నడుస్తున్నదని ఆరోపించడం సహేతుకం కాదు.

59 రోజుల ముందు చేసిన తెలంగాణ ఏర్పాటు ప్రకటన ఒక అడుగు కూడా ముందుకు కదల లేదంటే, కనీసం క్యాబినెట్ నోటు కూడా తయారు కాలేదంటే అందుకు కారణం సీమాంధ్ర ఉద్యమం వల్ల తలెత్తుతున్న ఒత్తిడి మాత్రమే అన్నది వాస్తవం. పైకి ఎంత బింకంగా కన్పించినా ఉద్యమ వేడికి కేంద్ర నాయకత్వం తల్లడిల్లి పోతున్నదని అర్థం.

అయితే అంత మాత్రాన తెలంగాణ ఏర్పాటును నిరవధికంగా వాయిదా వేస్తారని భావించడం పొరపాటు. రెండు పక్షాలను ఒక అంగీకారానికి ఒప్పించడానికి ప్రయత్నించడమే తప్ప ఒక పక్క వారిని సంతృప్తిపరచే ఏ నిర్ణయాన్ని కూడా కేంద్రం తీసుకొనే అవకాశం లేదు.

### హైదరాబాద్ విషయంలోనే రాజీ

హైదరాబాదు విషయంలో మాత్రమే కేంద్రం కొంత రాజీపడే అవకాశం కన్పిస్తున్నది. తెలంగాణ వాదులు మనసులు గాయపడకుండా, వారు పెద్దగా అభ్యంతర పెట్టని రీతిలో హైదరాబాద్ విషయంలో ఉభయులను ఒప్పించడం ద్వారా ఈ సమస్య పరిష్కరించాలని ఆలోచిస్తున్నట్లు తెలుస్తున్నది. అయితే ఎప్పుడు జరుగుతుంది అన్నది తెలియదు. అంతవరకు ఈ రావణ కాష్టం ఇట్లా కాలుతూనే వుంటే రాష్ట్రం ఏమైపోవాలి అన్నది అందరి ఆందోళన. హైకోర్టు దయతలచి, ఉద్యోగుల సమ్మె మీద కఠినమైన ఆదేశాలు ఇస్తే తప్ప ఇప్పట్లో ఇది సమసిపోయేట్లు కన్పించడం లేదు.

### జగన్‌వైపు అందరి చూపు

ఇదిట్లా వుంటే జైలు నుంచి విడుదలై వచ్చిన వైఎస్‌జగన్ తనను తాను సమైక్య ఆంధ్ర ఛాంపియన్‌గా ప్రకటించుకోవడానికి సిద్ధపడతాడా లేక, తెలంగాణలో కోల్పోయిన పట్టును తిరిగి పొందడానికి వూగిసలాట వైఖరి అవలంభిస్తాడా అన్నది తేలడం లేదు. జగన్ పార్టీ ఇప్పటి వరకు సమైక్యాంధ్ర ఉద్యమానికి తనను తాను ఒక సంకేతం వలె భావిస్తున్నది. కొండా సురేఖ నిష్క్రమణ తర్వాత తమ పార్టీకి తెలంగాణలో నిలువ నీడ వుండదన్న భయంతో ఆ నిర్ణయానికి వచ్చారు వారు. అయితే జగన్ జైలు నుంచి విడుదలైన తర్వాత కొన్ని తెలంగాణ జిల్లాలలో కూడా జనం వీధులలో టపాసులు పేల్చి, సంబరాలు చేసుకోవడం చూసి ఆ పార్టీలో కొంత పునరాలోచన కన్పిస్తున్నది. రాబోయే ఒకటి రెండు రోజులలోనే వైఎస్‌జగన్ ఈ విషయంలో ఒక స్పష్టమైన విధానాన్ని ప్రకటిస్తాడని భావిస్తున్నారు.

## ముఖ్యమంత్రి కొత్త పార్టీ

16వ పేజీ కొరవ

అర్థమైపోతున్నది. రాజకీయాలలో కొనసాగాలను కొనే వారు, ఎన్నికల సమయంలో ఖాళీగా ఇంట్లో కూర్చోలేరు. ఆ నైర్యాశ్యంలో నుంచి పుట్టుకొస్తున్న ఆలోచనే కొత్త పార్టీ. కిరణ్‌కుమార్‌రెడ్డి తిరుగులేని సమైక్యవాది అన్న అభిప్రాయం ఉద్యమంలో వున్న వారందరిలో ఏర్పడిపోయి వుంది. ఆ సానుకూలతను రాజకీయంగా వాడుకొంటే కొంతలో కొంత అయినా ఎన్నికలలో గెలిచే అవకాశం వుంటుందేమో అన్నది ఆశ. అయితే కిరణ్‌కుమార్‌రెడ్డి స్వతహాగా నాయకత్వ లక్షణాలు వున్నవాడు కాదు. తన జిల్లాలో కూడా ఆయన ప్రభావం తన నియోజక వర్గానికి మాత్రమే పరిమితం. రాష్ట్రంలో ప్రజలను ప్రభావితం చేయగల స్థాయిలో ఉపన్యాసాలు చేసే శక్తి లేదు. రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో తన మనుషులను కూడకట్టుకొనే సామర్థ్యమూ లేదు. అందువల్ల కిరణ్‌కుమార్‌రెడ్డి అంత సాహసం చేయకపోవచ్చునని ఒక వాదన.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### అనిల్‌కు విముక్తి!

వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని జైలుకు పంపడం మొదలు నల్లదుస్తులు ధరించి నిరసన తెలుపుతుండిన వైకాపా నెల్లూరు నగర సమన్వయకర్త డాక్టర్ పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్ సిబిఐ కోర్టు బెయిల్ మంజూరు చేయడంతో దుస్తులు మార్చారు. తెల్ల దుస్తులు ధరించిన అనిల్ స్కూటర్ ర్యాలీలో పాల్గొనడం చూసిన ప్రజలు ఆయన ధృడ సంకల్పాన్ని ఈ సందర్భంగా ప్రశంసించారు.

### వైశ్య సమాఖ్యలో కెవిచలమయ్య!

నెల్లూరులో ఆర్యవైశ్య ప్రముఖుడు కెవిచలమయ్యను అంతర్జాతీయ వైశ్య ఫెడరేషన్ రాష్ట్ర ఉపాధ్యక్షునిగా ఆ ఫెడరేషన్ జాతీయ అధ్యక్షుడు మాజీ ఎమ్పీ రామ్‌దాస్ నియమించారు. ఈ పదవిలో 2015 వరకు చలమయ్య కొనసాగుతారు.

### మాస్టర్ ప్రింటర్స్ అసోసియేషన్ మద్దతు!

నెల్లూరులోని ప్రింటింగ్ ప్రెస్, డిటిపి ఆపరేటర్స్, స్క్రీన్ ప్రింటర్స్, బైండర్స్, రబ్బర్ స్టాంప్స్ యజమానులు ఎపి మాస్టర్ ప్రింటర్స్ అసోసియేషన్ నేతృత్వంలో 24వ తేది సమైక్యాంధ్రకు మద్దతుగా ర్యాలీ, వంటావార్పు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో సంఘం అధ్యక్షులు అల్లు కేశవరావు, కార్యదర్శి వివి రమణారెడ్డి, కోశాధికారి ఎం.శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

### సమైక్యాంధ్ర బంద్ విజయవంతం

సమైక్యాంధ్రకు మద్దతుగా నగరంలో 24వ తేది చేపట్టిన బంద్ విజయవంతం అయ్యింది. ఎన్జీఓల పిలుపు మేరకు రాష్ట్రవ్యాప్తంగా జరిగిన బంద్‌లో భాగంగా నగరంలోనూ బంద్ నిర్వహించారు. పొద్దుటి నుంచే వాహనాల రాకపోకలను అడ్డుకోవడంతో నిత్యం జనంతో కిటకిటలాడే ప్రధాన కూడళ్లు జన సంచారంలేక బోసిపోయాయి. వ్యాపారులు స్వచ్ఛందంగా మద్దతు పలకడంతో అన్ని అంగళ్లు మూతపడ్డాయి. కొన్ని చోట్ల నిరసన కారులు ఆటోలకు అద్దాలు పగుల గొట్టడంతోపాటు టైర్లకు గాలి తీసేశారు. హైవేలో రాకపోకలు అడ్డుకొన్నారు. మొత్తంమీద ఇటీవల జరిగిన బంద్‌లలో సమైక్యాంధ్ర బంద్ బాగా జరిగిందని చెప్పాలి.

### వేమారెడ్డి రంగనాయకమ్మ మరణం

నెల్లూరు రూరల్ మండలం అల్లీపురం గ్రామ రైతు కుటుంబీకుడు వేమారెడ్డి ఆదినారాయణరెడ్డి భార్య వేమారెడ్డి రంగనాయకమ్మ(70) 15వ తేది మరణించారు. నెల్లూరు ట్రంకురోడ్డులో కేక్స్‌కార్నర్ నిర్వాహకులు రవీంద్రనాథ్‌రెడ్డి, మధుసూధన్‌రెడ్డి ఈమె కుమారులే. మాతృమూర్తిని కోల్పోయిన వీరికి మా సానుభూతి.

## మాలతీ చందూర్

15వ పేజీ కొరవ

టిక్‌గా మేళవించి ఒకే వాక్యంలో చెప్పగలిగారు. మంచి భావన. రాజశ్రీ గారన్నట్టు మీరు చిట్టి కవి కాదు – గట్టి కవే!" అంటూ నన్ను అభినందించారు మాలతీ చందూర్ గారు.

ఆమె ఎంతటి సౌమ్యమూర్తో. అంతటి శక్తివంతురాలు. జ్ఞానంతో అణువు కింద అణువుగా అణిగిపోయే ఆమె అదునుకు పదునై విజ్ఞానంతో నింగికెగసి విస్తరించి, శాఖోపశాఖలై వికసిస్తుంది. ఆహ్లాదంగా ఆ మానవమూర్తి హసిస్తుంది. ఆమె పాతకెరటాలు అనే శీర్షిక ద్వారా 350 ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఆణిముత్యాల వంటి పుస్తకాలను పరిచయం చేసిన ఏకైక రచయిత్రి. అంతే కాదు ఆమె సాహితీ గమనంలో 16 పురస్కారాలను అందుకున్నారు. ఆమె రాసిన 'హృదయ నేత్రి' అనే నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, అలాగే పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం నుంచి 'కళా ప్రపూర్ణ' బిరు దును స్వీకరించారు.

కృష్ణాజిల్లా ఆడపడుచు, నూజివీడు మెట్టినిల్లయి, చెన్నైలో స్థిరపడిన మాలతీ చందూర్ తన 84వ ఏట 2013 ఆగష్టు 21వ తేదిన కాలం చేశారు. ఎప్పుడు ఎక్కడ కలిసినా, చూసినా ఆ కట్టూ, బొట్టూ ఆ మాట తీరు, నడక, నడత అమోఘం. అనన్య సామాన్యం. అలాంటి మహత్తర వ్యక్తి శ్రీమతి మాలతీ చందూర్‌తో గడిపిన ఆ క్షణాలు గుర్తుకొచ్చి – కళ్లు చెమర్చాయి ఆ జాతి గులాబి మరణ వార్త విని.

## పదరంగం -86

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | 4 | | 5 | | 6 | 7 |
| 8 | | | | | | 9 | 10 | | |
| 11 | | 12 | | 13 | 14 | | 15 | | |
| | | 16 | | | 17 | 18 | | | |
| 19 | | | | 20 | | 21 | | 22 | |
| | | | 23 | | 24 | | | | |
| 25 | | 26 | | | 27 | | 28 | | |
| | | 29 | | 30 | | | 31 | | 32 |
| 33 | | | | 34 | 35 | | 36 | | |
| 37 | | | | 38 | | | | | |

**అడ్డం**

1. గనికి మరో పేరు (2)
3. చెడ్డ పేరు, నింద (4)
6. సమావేశం (2)
8. రావడం లేదు కదా! అదే చెప్పండి (2)
9. దేవతల, రాజుల విసన కఱ్ఱ (4)
11 తడబడిన పరుషం (3)
13. అటునుంచి కుక్కుటము (2)
15. దీపం సైజు (3)
16. తెలుగు శరమ్ (2)
17. కవిత్వం వ్రాసేవాడు (2)
19. లేమి కాదు. సంపద (3)
21. నేర్పరితనం (4)
23. రెండు 'పర'లతో వరుస (4)
25. గంజివారకుండా అన్నంతో ఇమిడిపోవునట్లు పెట్టే ఎసరు (4)
27. అణిగి వుండడం వినయం (4)
29. కాబట్టి (3)
31. అటునుంచి ఆశ కాదు (3)
34. వాయువు (2)
36. అటునుంచి చిన్న పిల్ల వాడికిచ్చే ఆహారం (3)
37. సమయం (3)
38. రాకపోకడ కాదు (3)

**నిలువు**

1. హిందీ స్థిరపరచడం నిశ్చయం (3)
2. తెలుగు మినిట్ (3)
4. బంగారు (3)
5. క్రిందనుంచి తెలుగు ఫీస్ట్ (2)
6. యుద్ధం (3)
7. ఇది చెప్పడం అంటే ముగించడం (5)
10. మేలుకో అని హిందీలో చెప్తున్నాడు (2)
12. పసుపు పచ్చదనం (3)
14. చీర (2)
18. తెలుగు ఎంక్వయిరీ (4)
19. క్రిందనుంచే అలగడం (3)
20. ఒడ్డు (2)
22. మార్బుల్ స్టోన్ (5)
23. ప్రతిష్టతో పాటిదే, గౌరవం (3)
24. అపరాత్రి క్రిందనుంచి 1,2 అక్షరాలు (2)
26. కారణం కలిగి (4)
28. క్షేమం (3)
30. దండోరా (3)
32. తడబడిన వనితా (3)
33. అమ్మ, తల్లి (2)
35. క్రిందనుంచి ప్రస్తుత కాల పురుషుడు (2)

**సమాధానాలు**

## పదరంగం -85

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | భి | 2 మ | 3 తం | | 4 చా | 5 క | చ | 6 క్య | 7 ము |
| చి | | 8 ర | తు | 9 చ | | వ | | 10 వా | క్కు |
| ర | | క | | 11 ద | 12 వ | నం | | ము | |
| 13 కా | గి | తం | | 14 రం | డి | | 15 ద | | 16 లు |
| లం | | | 17 వే | గం | గా | | 18 రు | 19 గ | వ |
| | 20 కు | లు | కు | | | 21 ఆ | వు | పా | లు |
| 22 పో | టీ | | 23 వ | 24 ద | 25 నం | | | | శా |
| 26 లి | ల | త | | 27 ప | ద | 28 ని | 29 స | 30 లు | |
| 31 క | త్వ | | | 32 ఆ | న | ప | కా | య | లు |
| 33 లు | ము | పా | | | | | 34 లం | కా | |

# మాలతీ చందూర్‌ను మరవడం కష్టం!

మదరాసు మహానగరం... డాక్టర్ నాయర్ రోడ్డులో స్వర్గీయ డాక్టర్ ఎమ్మెస్ రెడ్డి గారి కౌముది పిక్చర్స్ సినిమా కంపెనీ వుండేది. వారి కుటుంబం కూడా అక్కడే. అప్పుడు వారి ఆఫీస్‌లో నేను స్క్రిప్ట్ సెక్షన్ మరియు డైరక్షన్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తూ వుండేవాడిని. రెడ్డి గారు ఒకవైపు సినిమాలు తీస్తూనే సినిమాకు సినిమాకు మధ్య గ్యాప్ దొరికినప్పుడు సాయంకాలం టైమ్‌లో 'కవి సమ్మేళనం' పేరుతో కవుల 'గెట్ టు గెదర్' ఏర్పాటు చేసేవారు. అది వారి ఆఫీసు ప్రాంగణంలోనే జరిగేది. కొంత మంది రచయితలకు ఫోన్‌చేసి రమ్మని ఆహ్వానించేవారు. ఈ కార్యక్రమం దాదాపు రెండు గంటలపాటు సాగేది. అది ఆయనకు ఇష్టమైన కార్యక్రమం.

*అలాంటి ఓ సాయంకాలం...*

ఆ 'గెట్ టు గెదర్' ఏర్పాటు చేశారు. లాన్‌లో ఓ పొడవాటి టేబిల్ వేయించి దాని చుట్టూ కుర్చీలు ఏర్పాటు చేసేవారు. టేబిల్‌పై తెల్లని టేబిల్ క్లాత్ వేయించి, దానిపై మంచి గంధము, మల్లెపూలు, మనోరంజని మొగ్గలు, గులాబీలు, నులు వెచ్చని పాలు ఏర్పాటు చేయడం జరిగేది. అలాగే వేడి వేడి పకోడీలు, మిర్చీ బజ్జీలు, అరటికాయ బజ్జీలు, మినప వడలు, మసాలా వడలు, కాఫీ, టీ, వాటర్ బాటిల్స్ అన్ని ఏర్పాట్లు జరిగేవి. అవాళ 'గెట్ టు గెదర్'కు శ్రీమతి మాలతీచందూర్ గారు, ఆమె భర్త ఎన్.ఆర్.చందూర్ గారు, మహాకవి శ్రీశ్రీ గారు, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు, పాలగుమ్మి పద్మరాజు గారు, రాజశ్రీ గారు వచ్చారు. ఇక డాక్టర్ ఎమ్మెస్ రెడ్డి గారు, నేనూ మామూలే. వచ్చిన వారిని నిశితంగా పరిశీలనగా చూశాను నేను. కృష్ణశాస్త్రి గారు తెల్లని పంచె, తెల్లని లాల్చీ, మెడలో తెల్లని స్కార్ఫ్, శ్రీశ్రీ గారు తెల్లని లాంగ్ క్లాత్ పైజమా, తెల్లని హాఫ్‌షర్టు, చందూర్ గారు తెల్లని లాల్చీ, రంగు ఫాంటూ, మాలతి గారు నదుటున పెద్ద బొట్టు, చీరతో నిండుగా మూర్తీభవించిన భారతీయ స్త్రీగా ముస్తాబై వచ్చారు. ఇక రెడ్డి గారు తెల్లని పొందూరు ఖద్దరు పంచె, తెల్లని ఖద్దరు లాల్చీ, నేనూ, రాజశ్రీ గారు, పాలగుమ్మి పద్మరాజు గారు ఫాంట్స్, షర్ట్సుతో వున్నాము. మిగిలిన వారికి కాస్తో కూస్తో నేను పరిచయస్తుణ్ణే. కాకపోతే మాలతీ చందూర్ దంపతులను అదే తొలి సారిగా నేను చూడటం, కలవడం. అసలు ఈ 'చందూర్' అన్న మాట వారికి ఎలా వచ్చింది? మాలతి గారి భర్త పూర్తి పేరు 'చందూరు నాగేశ్వరరావు' గారు. ఆయన ఎన్.ఆర్.చందూర్ అయ్యారు. అలాగే ఆయన శ్రీమతి మాలతీ చందూర్ అయ్యారు.

కాస్సేపు అందరం కలివిడిగా సాహిత్య విషయాలను గూర్చి చర్చించుకున్నాము. అందులో నా చొరవ, చురుకుదనం గమనించిన మాలతీ చందూర్ గారు ఆసక్తిగా నా వంక చూస్తూ "ఎవరీ అబ్బాయి? కొత్తగా వచ్చారా?" అంటూ అడిగారు. వెంటనే రెడ్డి స్పందిస్తూ "మా ఊరబ్బాయే. ఇటీవల ఆంధ్రప్రభ సచిత్ర వార

**జయంపు కృష్ణ**

పత్రికలో సీరియల్‌గా వచ్చిన ఈ అబ్బాయి మొదటి నవల 'ప్రేమ పూజారి' బాగా హిట్టయ్యింది. మంచి పాపులారిటీ తెచ్చి పెట్టింది". అని చెప్పారు. చాలా సంతోషం బాబూ! ఆ నవల రాసింది మీరా? నా దృష్టికి కూడా వచ్చింది. కంగ్రాచ్యులేషన్స్" అంటూ మాలతీ చందూర్ గారు అభినందించారు. నేను వినమ్రంగా లేచి నిలుచుని నమస్కరించాను కృతజ్ఞతలు తెలుపుతూ.

ఆ తర్వాత అల్పాహారం సేవించి, పాలు, టీ గట్రా తాగాము. తదుపరి మిగిలిన సాహిత్య సమాలోచనలు సాగాయి. కొన్ని చిత్రమైన సమస్యలు రెడ్డి గారు యివ్వగానే ఎవరికి తెలిసిన సమాధానాలు వారివ్వసాగారు. అన్ని విషయాలు నేను క్లుప్తంగా రాసుకునే వాడిని. ఒకరకంగా ఆ సమ్మేళనానికి లేఖకుణ్ణి. సమావేశం చివరి అంకంలో రెడ్డి గారు ఒక విచిత్ర అంశాన్ని సమస్యగా యిచ్చారు. మహాకవి శ్రీశ్రీ జీవితాన్ని, కవిత్వాన్ని కలిపి ఒకే వాక్యంగా పొయటిగ్గా చెప్పాలన్నది ఆ సమస్య. శ్రీశ్రీ గారు యివేమీ పట్టనట్టుగా కుడి చేయి పిడికిలి మధ్య సిగరెట్టు కాల్చి పట్టి బొటన వేలు, చూపుడు వేలు మధ్య రంధ్రంలోంచి దమ్ములాగి వదులుతున్నారు. ఇది ఆయన స్టైల్. ఆ దృశ్యం గమ్మత్తుగా వుంటుంది. ఆ పిడికిలి కార్మిక శక్తికి ప్రతిబింబమని, కాలుతున్న ఆ సిగరెట్టు కార్మిక శ్రమ ఫలితాన్ని కార్మికులకు అందనీయకుండా కాల్చివేస్తున్న పెట్టుబడిదారులకు ప్రతీక అని ఓ సారి శ్రీశ్రీ గారు స్వయంగా నాకు చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది. తదేకంగా శ్రీశ్రీ గారినే చూస్తూ వున్న నన్ను గమనించిన రాజశ్రీ గారు "చిట్టి కవీ! ఇప్పటివరకు చూస్తున్నాను. మాటలేదు, పలుకు లేదు, రెడ్డి గారిచ్చిన సమస్యను నువ్వు పూరించ గలవా?" అంటూ అడిగారు. నేను ఉలిక్కిపడి తేరుకున్నాను.

"నేనూ..." అంటూ ఆగి, రెడ్డిగారి వంక చూశాను. ఆయన వెంటనే "చెప్పవయ్యా! ఇది చాలా కష్టమైన సమస్య. అందులో శ్రీశ్రీ గారి జీవితమూ రావాలి. కవిత్వమూ రావాలి. పైగా పొయిటిక్ వుండాలి. ఇదంతా ఒకే ఒక వాక్యంలో చెప్పగలగాలి. రాజశ్రీ అడిగాడు కదా? నువ్వు చెప్పగలిగితే చెప్పు" అన్నారు. "జీవితంలో శ్రీశ్రీ నైట్రోజన్ – కవిత్వంలో శ్రీశ్రీ మెషిన్ గన్" అని చెప్పాను వెంటనే. శ్రీశ్రీ గారు తపోభంగమైనట్టు నోటి దగ్గర పిడికిలి పక్కకు తీసి, నా వంక మెచ్చుకోలుగా చూశారు. అందరూ చప్పట్లతో అభినందించారు. "మీరు సైన్స్ గ్రాడ్యుయేటా?" అని అడిగారు మాలతీ చందూర్ గారు. "అవును మేడమ్" అంటూ పైకి లేచాను. "కూర్చోండి! నైట్రోజన్ మందకొడి వాయువు. జీవితంలో శ్రీశ్రీ గారు చాలా నెమ్మదస్తుడు. మరి ఆయన కవిత్వం మెషిన్ గన్‌లోంచి బుల్లెట్లు దూసుకుపోతున్నట్లే వుంటుంది. రెండింటినీ మీరు పొయి

కొరవ 14వ పేజీలో



## రైతు లోకం

# ఖరీఫ్‌కి అనువైన వరి రకాలు!

**డాక్టర్ వై.సూర్యనారాయణ**
ప్రధాన శాస్త్రవేత్త,
వ్యవసాయ పరిశోధనా స్థానం, నెల్లూరు.

మన రాష్ట్రంలో సార్వా వరి పంట దాదాపు 26లక్షల హెక్టార్లలో సాగు నీటి కాలువలు, చెరువులు, బావులు మరియు వర్షాధారంగా సాగు చేయబడుచున్నది. సార్వా పంట కాలంలో తరచుగా వర్షాలు పడుతూ ఆకాశం మేఘావృతమై వుంటుంది. సార్వాలో మన ప్రాంతానికి అనువైన రకాన్ని ఎంపిక చేసుకొని, నాణ్యమైన విత్తనాన్ని సేకరించి సిఫార్సు చేసిన యాజమాన్య పద్ధతులు పాటించనట్లయితే మంచి దిగుబడులు పొందవచ్చు.

సాధారణంగా సార్వాకి దీర్ఘ (150 రోజులు) మరియు మధ్యస్థ కాలిక రకాలను (135రోజులు) రకాలను ఎంపిక చేసుకోవాలి. సార్వాకి అనువైన కొన్నిరకాలు, వాటి లక్షణాలు.

**స్వర్ణ** (MTU7029) : పంటకాలం 150 రోజులు. ఎకరానికి మూడు టన్నుల దిగుబడి వస్తుంది. వివిధ రకాల భూముల్లోను, వాతావరణ పరిస్థితుల్లోను స్థిరమైన దిగుబడినిచ్చే రకం. తక్కువ నత్రజనితో ఎక్కువ దిగుబడినిస్తుంది. చౌడు భూములలో కూడా పండించవచ్చు. వెన్నుపై గింజ మొలకెత్తదు.

**చైతన్య** (MTU2067) : పంటకాలం 150 రోజులు. ఎకరానికి రెండున్నర టన్నుల దిగుబడి వస్తుంది. కృష్ణా – గోదావరి డెల్టాలకు, అనువైన రకం. చేనుపడిపోదు. సన్నబియ్యం, దోమపోటుని తట్టుకుంటుంది.

**కృష్ణవేణి** (MTU2077) : పంటకాలం 150 రోజులు. ఎకరానికి రెండున్నర టన్నుల దిగుబడి వస్తుంది. చేను మీద పడిపోదు, సుడిదోమని తట్టుకుంటుంది. బియ్యం మధ్యస్థ రకం.

**బాడవ మసూరి** (PLA1100) : పంటకాలం 155 రోజులు. ఎకరానికి మూడు టన్నుల దిగుబడి వస్తుంది. నీరు నిల్వ వుండే పల్లపు ప్రాంతాల సాగుకి రూపొందించిన రకం, సన్న బియ్యం, అన్నానికి బాగుంటుంది. కోత సమయంలో వర్షమొస్తే గింజ మొలకెత్తుతుంది.

(కొరవ వచ్చే వారం)

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14
జమీన్‌రైతు

# సమైక్యాంధ్ర ఉద్యమం చారిత్రాత్మకం!




సమైక్యాంధ్ర ఉద్యమం ఏ మాత్రం తగ్గుముఖం పట్టడం లేదు. ఇప్పటికి 59 రోజుల నుంచి నిరవధికంగా కొనసాగుతూనే వుంది. ఏ మాత్రం ఉద్యమ అనుభవం లేని ఎపి ఎన్జీఓ సంఘం నేతృత్వంలో ఇంత విస్తృత స్థాయి ఆందోళన నిరాటకంగా జరిగిపోవడం ఒక చరిత్ర క్రింద లెక్క. దీని వెనుక ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రోత్సాహం, ప్రభుత్వం పూర్తి స్థాయిలో సహకారం అందిస్తున్న మాట నిజమే. ప్రభుత్వ అధికారులే ముందు నిలబడి పాఠశాల విద్యార్థులను, పొదుపు లక్ష్మి మహిళలను సేకరించి ప్రదర్శనలు చేస్తున్న మాట నిజమే. అయితే కేవలం ప్రభుత్వ అధికారులు, ఉద్యోగుల కృషి వల్లనే ఈ ఉద్యమం ఈ స్థాయిలో నడుస్తున్నదని చెప్పడం పొరపాటు. ప్రజలలో కూడా ఉద్యమం లక్ష్యం పట్ల ఆకర్షణ వున్నందువల్లనే ఇది సాధ్యమౌతున్నదని అంగీకరించక తప్పదు. ఏదైన ఒక విషయం మీద బంద్ జరపాలంటే ఎంతో ప్రయాసపడాలి. ఎన్నో ముందు జాగ్రత్తలు తీసుకోవాలి. పెద్దసంఖ్యలో కార్యకర్తలను సమీకరించాలి. అన్ని చేసినా ఆటోలు, ప్రైవేటు కార్లు తిరుగుతూనే వుంటాయి. కానీ సమైక్యాంధ్ర పేరుతో దారినపోయే దానయ్య ఎవరో ఒకరు బంద్ పిలుపు ఇచ్చి, వూరకుంటే చాలు, జనం స్వచ్ఛందంగా పూర్తిస్థాయి హర్తాళ్ పాటిస్తున్నారు.

## విసుగులేని ప్రజలు!

ఆర్టీసి బస్సులు తిరగక ఒకటిన్నర నెలదాటిపోయింది. బడులు మూతపడి పోయి వున్నాయి. పిల్లల చదువు చట్టుబండలుగా మారుతున్నది. ప్రభుత్వ కార్యాలయాలలో చిన్నపాటి పని కూడా జరగడం లేదు. కాంట్రాక్టర్లు, పలుకుబడి కల్గినవారు రాత్రి పూట తమ పనులు చక్కబెట్టుకొంటున్నారు. కానీ సాధారణ ప్రజలకు మాత్రం ప్రభుత్వ సేవలు పూర్తిగా నిలిచిపోయాయి. పాలన స్తంభించిపోయి వుంది. ఈ ప్రతిష్టంబన పట్ల సాధారణంగా ప్రజలలో విసుగు, ద్వేషం జనించాలి. కానీ పరిస్థితి చూస్తే అటువంటి సూచనే కన్పించడం లేదు. ఎన్ని కష్టాలకు ఓర్చి అయినా రాష్ట్ర విభజన అడ్డుకోవాలన్న పట్టుదల ప్రజలలో కూడా స్థిరపడి వున్నందువల్లనే ఉద్యమం చరిత్రాత్మక తీరులో నడిచిపోతున్నది.

తెలంగాణ ఉద్యమంలో కూడా ప్రజల పాత్ర అధికమన్న మాట నిజమే. అయితే అక్కడ ఉద్యమాన్ని నడిపించడానికి అన్ని స్థాయిలలో రాజకీయ నాయకత్వం వుంది. కెసిఆర్ ఒకపక్క వుంటే, మావోయిస్టు సానుభూతిపరులు, మేధావులు, కవులు కళాకారులు, రచయితల వంటివారు మరొక ప్రక్క ఉద్యమ సారధ్యం వహిస్తున్నారు. రాజకీయ ప్రమేయం అధికం కావడం వల్ల ప్రజలను బలవంత పెట్టడం, వ్యాపారులను పీడించి నిధులు సేకరించడం వంటి ఉదంతాలు కన్పిస్తాయి. కానీ సీమాంధ్రలో ఇప్పటి వరకు ఏ రాజకీయ పార్టీకి కూడా ఉద్యమం మీద పట్టు దొరకలేదు. వైఎస్ఆర్ కాంగ్రెస్ తరఫున విజయమ్మ దీక్ష చేసినా, షర్మిల బస్సు యాత్ర జరిపినా ప్రజలు వారికి నాయకత్వం పట్టివ్వలేదు.

## తేలికగా తీసుకొంటున్న కేంద్రం

అయితే ఈ పరిణామాలను, ఈ ఉద్యమ తీవ్రతను కేంద్ర నాయకత్వం తేలికగా తీసుకొన్నట్లు కన్పిస్తున్నది. దిగ్విజయ్‌సింగ్ గత వారం రోజులుగా చేస్తున్న ప్రకటనలే అందుకు సాక్ష్యం. ఉద్యమం పేరుతో కొందరు ప్రజలను వేధిస్తున్నారని, ప్రైవేటు బడులు, బస్సులు, కార్పొరేట్ ఆఫీసులు వంటివి నిక్షేపంగా నడుపుకొంటూ; ఆర్టీసి బస్సులు, ప్రభుత్వ బడులు, కార్యాలయాలను మాత్రం నిలిపి వేస్తున్నారని, దానివల్ల సామాన్య ప్రజలు మాత్రమే అవస్థలు పడుతున్నారని, ఉద్యమాన్ని స్వార్ధపరులు నిర్వహిస్తున్నందువల్లనే ఈ పరిస్థితని ప్రకటించాడాయన. ఆయన మాటలలో కొంత నిజం వుందని అంగీకరించాలి. ప్రైవేటు బస్సులను, బడులను ఉద్యమకారులు పట్టించుకోవడంలేదన్న మాట నిజం. అయితే

కొరవ 14వ పేజీలో

# ముఖ్యమంత్రి కొత్త పార్టీ!



ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి స్వంత పార్టీ పెట్టుకొంటాడనే ప్రచారం జోరుగా సాగుతున్నది. ఆయన రాజకీయ సామర్థ్యం తెలిసిన వారెవరూ ఈ వార్త నమ్మరు. కానీ ఆయన ఆంతరంగికులుగా చెప్పుకొనే కొందరు ఎమ్మెల్యేలు మాత్రం కొత్త పార్టీ ఖాయం అని ఘంటాపదంగా చెప్తున్నారు. రాష్ట్రంలో, మరీ ముఖ్యంగా ఆంధ్ర ప్రాంతంలో కాంగ్రెస్ పార్టీ భూస్థాపితం అయిపోయినట్లేనని అందరూ అంగీకరిస్తున్నారు. రేపటి ఎన్నికలలో ఆంధ్ర, రాయలసీమ జిల్లాలలో అసలు బోణీ అయినా పడుతుందా అన్నది అనుమానం. కరెంట్ కష్టాలు, పెట్రోల్ ధరలు, నిత్యావసర వస్తువుల ధరలు వంటి వాటి వల్ల మామూలుగానే కాంగ్రెస్ అంటే జనంలో ద్వేషం పుట్టి వుంది. తెలంగాణ ప్రకటన, దానిపై చెలరేగిన సమైక్యాంధ్ర ఉద్యమ ఉధృతితో కొరవా సరవా అవకాశాలు కూడా తుడిచిపెట్టుకొని పోయాయి. వీలైనంత వరకు కాంగ్రెస్ వాదులు జగన్ పంచన చేరడానికి ప్రయత్నం చేస్తున్నారు. కానీ అది అందరికీ వీలయ్యేట్లు కన్పించడం లేదు. చాలా జిల్లాలలో ఖాళీలు లేవు. అటువంటి వారందరిలో తమ రాజకీయ భవిష్యత్తు మీద ఆందోళన నెలకొని వుంది. కాంగ్రెస్ తరఫున పోటీ చేస్తే, డిపాజిట్ కోసం కట్టే సొమ్ము కూడా దండగ అని

కొరవ 14వ పేజీలో

## జగన్‌కు బెయిలు?

మొదటి పేజీ కొరవ

బెయిల్ కోసం దరఖాస్తు చేసినప్పుడు, సెప్టెంబర్ నెలాఖరు లోపల దర్యాప్తు పూర్తి చేసి ఛార్జిషీట్ల తంతు పూర్తి చెయ్యమని సిబిఐని ఆదేశించింది సుప్రీంకోర్టు. ఆ ప్రకారం సిబిఐ అన్ని ఛార్జిషీట్లనూ వేసేసింది కాబట్టి బెయిల్ రావడం సహజం అని చెప్తున్నారు. అయితే ఇది నిజం కాదని పసి పిల్లవాడికి కూడా అర్ధమై పోతున్నది. జగన్ కేసు చాలా విస్తృతమైనదని, లెక్కకు మించిన కంపెనీలు, వాటి లావాదేవీలు, వాటిలో కొన్నిటికి విదేశాలతో సంబంధాలు వున్నాయని, ఒక నిర్ణీత వ్యవధిలో దర్యాప్తు పూర్తి చేయడం అసాధ్యమని మొదటి నుంచి న్యాయ స్థానాలకు నివేదిస్తూ వచ్చింది సిబిఐ. కాని వున్నట్లుండి ప్లేట్ ఫిరాయించి, తమ బాధ్యత ముగిసిందని తదుపరి దర్యాప్తు ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ చూసుకొంటుందని చేతులెత్తేసింది. నిజానికి జగన్ మీద హైకోర్టు విచారణకు ఆదేశించిన కేసు ప్రకారం ఇంకా చాలా కంపెనీల వ్యవహారాలు మిగిలి వున్నాయి. జగన్ అక్రమ లావాదేవీలకు పునాది వంటి కార్మెల్ ఏసియా, సండూర్ పవర్, సరస్వతి పవర్, బ్రహ్మణి ఇన్‌ఫోటెక్, మంత్రి డెవలపర్స్, ఆర్ఆర్ గ్లోబల్, జూబ్లీ మీడియా వంటి కంపెనీల లావాదేవీలను కోర్టు ముందుకు తేవడంలో సిబిఐ విఫలమైంది. దాన్ని మించి, జగన్ సృష్టించిన దాదాపు పాతిక సూట్‌కేస్ కంపెనీల ప్రస్తావనే ఏ ఛార్జిషీట్‌లో కూడా చేయలేదు. అంటే తన దర్యాప్తును సగంలో వదలిపెట్టి మరీ జగన్ బెయిల్‌కు సిబిఐ సహకరించిందన్నది స్పష్టం. ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ తదుపరి విచారణ జరిపిస్తుందని చెప్పడం ప్రజలను, న్యాయస్థానాలను మోసం చేయడం మాత్రమే. ఈడికి తనకు తానుగా దర్యాప్తు చేసే అధికారం కానీ, యంత్రాంగం కానీ లేవు. సిబిఐ, లేదా పోలీసు పెట్టిన కేసులలో నుంచి వివరాలు సేకరించి మాత్రమే చర్యలు తీసుకోవడం ఈడి విధి విధానం.

### ఛార్జిషీట్లలో లేని ఆస్తుల ప్రస్తావన

జగన్ మీద దర్యాప్తుకు హైకోర్టు ఇచ్చిన ఆదేశానికి మూలం – ఆయన అక్రమ ఆర్జన చేశాడన్న ఆరోపణ. అందుకు రుజువు – బెంగుళూరులో 22 ఎకరాలలో నిర్మించిన అరబ్ రాజుల తరహా ప్యాలెస్. హైదరాబాదులోని లోటస్‌పాండ్‌లో కట్టిన 70 గదుల భూరి భవంతి వంటి ఆస్తులు. కానీ విచిత్రంగా సిబిఐ అధికారులు వాటి వూసే ఎత్తలేదు ఏ కేసులో కూడా. ఈ భవనాలన్నిటిలో వారు సోదాలు జరిపారు. వాటి విలువ కట్టారు. లోటస్ పాండ్ ఇంటిని మదింపు చేయడానికి దాదాపు 40 మంది ఇంజనీరింగ్ నిపుణులకు మూడు రోజుల వ్యవధి పట్టిన నిజం అందరికీ తెలుసు. బెంగుళూరు ప్యాలెస్‌లో బంగారు జలతారు పరదాలున్నాయని, బాత్‌రూం కొళాయిలకు కూడా పసిడి పూత పోశారని అప్పట్లో వార్తలొచ్చాయి. ఆ ఒక్క భవనం విలువ 500 కోట్ల రూపాయలపై మాట అని ఇదే సిబిఐ అధికారులు పత్రికలకు లీక్‌లు ఇచ్చారు. కానీ జగన్ అక్రమ ఆస్తుల చిట్టాలో ఇటువంటి ఆస్తులు వేటినీ చేర్చలేదు.

సూట్ కేస్ కంపెనీల ద్వారా, మారిషస్ కంపెనీల ద్వారా వేల కోట్ల రూపాయల మనీ ల్యాండరింగ్ జరిగిందని ఇదే సిబిఐ పలుమార్లు చెప్పింది. కానీ ఏ ఒక్క ఛార్జిషీట్‌లో కూడా ఆ ప్రస్తావన లేదు. అంతకంటే విశేషం, జగన్ బెయిల్ కేసు విచారణకు వచ్చిన ప్రతిసారీ సుప్రీంకోర్టు నుంచి సీనియర్ న్యాయవాదులను రప్పించి, తీవ్రంగా అభ్యంతరాలు వ్యక్తం చేసే సిబిఐ ఈసారి మాత్రం, మామూలు న్యాయవాదితో తూతూమంత్రంగా తన వాదన సరిపెట్టింది.

### మతలబిది!

ఈ పరిణామాలన్నీ నిశితంగా పరిశీలిస్తే జగన్ బెయిల్ వెనుక ఏదో మతలబు నడిచిందన్న అనుమానం కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నది. అదేమిటో ఆ పరమాత్ముడికే తెలియాలి. దిగ్విజయ్ సింగ్ రాష్ట్ర పరిశీలకుడిగా నియమితుడైనప్పటి నుంచి జగన్ సంబంధీకులతో మంతనాలు నడుస్తూ వున్నాయని చెప్తుండినారు. కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్‌ల డిఎన్ఏ ఒకటే అని, అవి ఒక దానితో ఒకటి కలిసి పని చేయడం విచిత్రమేమీ కాదని బహిరంగ ప్రకటన కూడా చేశారాయన. దానికి కొనసాగింపుగా జగన్ సతీమణి భారతి, ఢిల్లీ మీడియాతో మాట్లాడుతూ కేంద్రంలో యూపిఏకు మద్దతు ఇవ్వడానికి తమకు ఇబ్బందులు లేవని ప్రకటన చేసింది. గతంలో జగన్ చెప్పిన మాట కూడా అదే. బిజెపితో కలవడానికి జగన్‌కు ఇష్టం లేదు కాబట్టి కేంద్ర రాజకీయాలలో కాంగ్రెస్ నేతృత్వంలోని యూపిఏతో కలవడం జగన్‌కు తప్పనిసరి కాబట్టి, ఆ ప్రకటనలు చేశారన్న వాదన వుంది. అయితే ఇప్పుడు కేంద్ర రాజకీయాలలో కాంగ్రెస్, బిజెపిల కూటముల కంటే, తృతీయ ఫ్రంట్ ప్రాబల్యం జాస్తిగా వుంది. అందువల్ల జగన్‌కు వేరే ప్రత్యామ్నాయం లేదనే వాదన సహేతుకం కాదు. అయినా సరే భారతి ఆ ప్రకటన చేయడంలో, దిగ్విజయ్ తమ డిఎన్ఏ ఒకటే అని చెప్పడంలో విశేషం లేదని భావించ గలమా?

ఏది ఏమైనా కాంగ్రెస్ పెద్దల సహకారం లేకుండా సిబిఐ కేసును వున్నట్లుండి ఇంతగా నీరుగార్చదు. సిబిఐ గట్టిగా పట్టుబట్టి వుంటే క్రింది కోర్టులో జగన్‌కు బెయిల్ దొరికేది కాదు. అవి రెండూ పచ్చి నిజాలు. ఒక వేళ సుప్రీంకోర్టు ఆదేశం అని సమర్ధించుకోజూసినా, క్రింది కోర్టు, ఆపై హైకోర్టులలో బెయిల్ దరఖాస్తు తిరస్కరణకు గురైన తర్వాత కానీ సుప్రీంకోర్టుకు వెళ్లలేరు. అందుకు కనీసం ఒకటి రెండు నెలల వ్యవధి కావాలి. ఇంత త్వరగా జగన్‌కు బెయిల్ ఇప్పించారంటే కాంగ్రెస్ పెద్దల మదిలో ఏదో రాజకీయ వ్యూహం కదలాడుతూ వుండాలి. నరేంద్రమోడి బిజెపి ప్రధాన మంత్రి అభ్యర్థిగా ప్రకటింపబడడం, ఆయన పట్ల సాధారణ ప్రజలలో వ్యక్తమౌతున్న ఆమోదం కాంగ్రెస్ వ్యూహానికి ప్రాతిపదిక అయి వుండవచ్చు. జగన్, బిజెపికి పచ్చి వ్యతిరేకి. ఆంధ్ర ప్రాంతంలో నరేంద్రమోడి ప్రభంజనాన్ని జగన్ ఒక్కడే నివారించగలడన్న అంచనా. జగన్ గెల్చుకొనే ఎమ్పీ స్థానాలన్నీ చివరకొచ్చేసరికి తమ ఖాతాలోనే జమ పడతాయన్న ఆశ కాంగ్రెస్ పెద్దలను ప్రభావితం చేసి వుంటాయని పరిశీలకుల వూహ.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com